# బాలరాజ్యం

రచయితలు :

ఫుల్టన్ ఔర్స్‌లర్,

విల్ ఔర్స్‌లర్



అనువాదం:

ఎన్. ఆర్. చందూర్

PRINTED AND PUBLISHED BY
KUBERA PRINTERS LTD.
"KUBERA BUILDINGS"
21, SUNKURAMA CHETTY STREET
MADRAS-1 (INDIA)

1

ఎడ్వర్డ్ జోసఫ్ ఫ్లానగన్ అను పేరు చెబితే అమెరికనులకి ఎంతో అపేక్ష. ఆయ నొక మతగురువు – రోమన్ కాథలిక్ మతగురువు. కాని, ఆయనంటే అనురాగం కనబరచిన లక్షలాది ప్రజలూ ఒకే మతానికి చెందినవారు కారు. ముఖ్యంగా యూదులకీ, ప్రాటెస్టెంటులకీ ఆయనమీద ఎంతో గురి—వారే ఆయన చేసిన మహత్తర కార్యానికి చేయూత నిచ్చారు.

ఆ మహత్తర కార్యం ఏమిటని అడుగుతారా? దిక్కులేని పిల్లలకి విద్యాబుద్ధులు నేర్పి, వారి విషయమై తగు శ్రద్ధ తీసుకోవడం; పోలీసులూ న్యాయస్థానాలూ వొదిలించుకోజూచే బాలాపరాధుల (Delinquents) విషయంలో మట్టుకే కాదు — అందరి విషయంలోను. బాలరాజ్యం అనేది యిల్లులేని పిల్లలకి యిల్లు వంటిది; తండ్రిలేని పిల్లలకి తండ్రి వంటిది.

నెబ్రాస్కాలోని ఒమహాకి పదిమైళ్ళు పశ్చిమంగా వున్న ఈ బాలరాజ్యంలో వర్ణ మత భేదాలు లేవు. చైనీయులూ, నీగ్రోలూ మిగతా వారితో కలిసిపోతారు; బాప్టిస్టులూ, యూదులూ ఒకే క్లాసురూమ్‌లో స్నేహంగా మసులుతారు. అన్ని జాతులవారినీ ఒకేమాదిరిగా చూస్తారు బాలనగర్‌లో.

తల్లిదండ్రులు మరణించడం వల్లనో, లేక యితర కారణాలవల్లనో దిక్కూ మొక్కూ లేనివారుగా అయిన

పిల్లలనీ, పోలీసులకి బాలాపరాధులుగా చిక్కి, ఆ పైన తన దగ్గరికి వచ్చిన పిల్లలనీ వేరువేరుగా ఉంచేవాడు కాదు ఫాదర్ ఫ్లానగన్. అందరినీ కలిపేసేవాడు. బాలాపరాధులు స్వల్ప కాలంలోనే మంచి బాలురుగా తయారయేవారు.

యినప కంచెలూ, గేట్లూ, తాళాలూ వగైరా లేమీ ఉండేవికాదు బాలరాజ్యానికి. అది స్వయంపోషకమైన చిన్న గ్రామం. అక్కడికి వచ్చిన ఏ బాలుడూ పారిపోదామనుకునే వాడుకాదు. అక్కడి శిక్షణను సంతోషంతో స్వీకరించేవారు బాలురందరూ. పొలం పని, పాఠాలు, వర్తక సరళి మొదలైన వన్నీ ఆడుతూ పాడుతూ నేర్చుకునేవారు. ప్రతి ఒక్కని వ్యక్తిత్వ ప్రకాశానికి అపూర్వ సావకాశం లభించేది.

పిల్లలకి మంచి నడత అలవరచాలనే ఆకాంక్షతో ఈ బాలరాజ్యం ప్రారంభించాడు ఫాదర్ ఫ్లానగన్. 20 మంది చెడ్డ పిల్లలు, 80 మంది మంచి పిల్లలతో కలవడంవల్ల, చెడ్డ పిల్లలు మంచి బుద్ధులు అలవరచుకోగలిగేవారు. బాలాపరాధుల విషయంలో న్యాయస్థానాలూ, పోలీసు వారూ చెయ్యలేనిది ఫాదర్ ఫ్లానగన్ చేసి, దుష్ట బాలురు శిష్టవర్తనులు ఎలా కాగలరో లోకానికి చాటాడు. తమని విమర్శించే వారుకాక, "తమకి మార్గ దర్శకంగా వుండే మనుషులు కావాలి పిల్లలకు" అన్నాడు ఫాదర్ ఫ్లానగన్. చిమ్మ చీకటిలో కాంతిరేఖ వంటివాడు ఈ ఫాదరీ.

"ఏది నిజమో, ఏది అబద్ధమో పిల్లలు యిట్టే తెలుసు కోగలరు" అని వెనక ఎమర్సన్ అన్న మాటలమీద ఫాదర్

ఫ్లానగన్‌కి చాలా నమ్మకం. "ఎంత అల్లరి పిల్లలైనా మనం చాకచక్యంతో ప్రవర్తిస్తే మంచివాళ్ళుగా మారుతారు. మనం తమని మోసం చెయ్యడం వాళ్లు సహించరు," అంటాడు. కొందరు సంఘ సంస్కర్తలు పిల్లలు ప్రేమచూపడం వల్ల చెడిపోతున్నారని మొరపెడుతూంటే, ఫ్లానగన్ పిల్లలను ఇంకా ప్రేమగా చూడమనేవాడు.

"నిర్భాగ్య బాలునికి ఆహారం, బట్టలూ, వసతీ యివ్వడంతో సరిపోదు. కడుపునిండా తిండీ, వొంటినిండా బట్టా, వుండేందుకు స్థలం—ఈమూడూ లభ్యమయినంత మాత్రాన బాలునికి తృప్తి కలగదు. అవి ముట్టజెప్పడం కాదు ముఖ్యం. తలి దండ్రుల ప్రేమ, కుటుంబ రక్షణ—యివి లోపిస్తున్నాయి ఆ కుర్రవానికి. ఆ లోపాన్ని పూడ్చగలిగితేగాని మన రిఫారమ్ స్కూల్సూ, అనాథాశ్రమాలూ ఉత్తమ ప్రయోజనాన్ని సాధించలేవు. ఒక కొత్తరకం సంఘసంస్కర్తలు రావాలి. ఆ సంఘ సేవా తత్పరులు మామూలు ట్రయినింగ్‌తో తృప్తిపడక, పిల్లలహృదయాల దగ్గిరికి వెళ్ళగలగాలి," అంటాడు ఫ్లానగన్.

తను ఏమి చేశాడో, అదే చెప్పాడు ఫ్లానగన్. ఆయనకి ప్రేమించడం తెలుసు. అందుకనే రకరకాల మనుషులు ఆయన్ని ప్రేమించగలిగారు. ఆయనిది ఎటువంటి దయాంతఃకరణో చెప్పలేం. విపరీతమైన దయ వుండటమే గాకుండా, ఆ దయని ఏ విధంగా కనబరచాలో కూడా ఆయనకి తెలుసు. దేహాన్నీ, మనసునీ, ఆత్మనీ దయాసముద్రం ద్వారా తెలుసుకునేవాడు. మన స్తత్వ పరిశోధనసుంచి

చాకలెట్లు పెట్టడందాకా వివిధములైన మార్గాలు ఆయనకి తెలుసు. ఆధ్యాత్మి కావేదనతో నిరంతర ప్రార్థనలు సలిపే వాడు బాలనగర్ పిల్లల పురోభివృద్ధి కోసం.

ఇతరులు ఆయన్ని ప్రేమించినట్టే, ఆయన యితరులను ప్రేమించాడని ఫాదర్ ఫ్లానగన్ విషయంలో అనుకోడానికి వీల్లేదు. "పొరుగువారిని ప్రేమించుము" అనే క్రైస్తవ మత సూక్తిని రేషనలిస్టులు ఉత్తమ సాంఘికాదర్శంగా ఉదహరిస్తూంటారు. ఫాదర్ ఫ్లానగన్ ఆ అర్థంలో వొప్పు కోడు. బైబిలులోని ఆపేరా అంతా చెప్పవలసిందే నంటాడు. కాంతి వంతములైన నీలి నేత్రాల వెనక ఏదో వెలుగు జిగేల్ మంటూండగా, ఆ చరణం యిలా చెప్పేవాడు :

"And thou shalt love the Lord, thy God with thy whole heart, and with thy whole soul, and with thy whole mind and with thy whole strength—and thy neighbor as thyself."

"నీకు దేవుడైన సృష్టికర్తని నీ హృదయ మంతటితోటీ నీ ఆత్మ అంతటితోటీ, నీ మనసు అంతటితోటీ, నీ శక్తి అంతటితోటీ ప్రేమించు. నీ పొరుగువాణ్ణి నిన్ను నువ్వు ప్రేమించుకున్నట్లు ప్రేమించు."

ఫాదర్ ఫ్లానగన్ ప్రభుసాయుజ్యం పొందినప్పుడు, "క్రిస్టియన్ హెరాల్డ్" పత్రికా సంపాదకుడైన ప్రాటెస్టెంటు మతగురువు రివరెండ్ డాక్టర్ డేనియల్ పోలింగ్ యిలా రాశాడు : "ఫాదర్ ఫ్లానగన్ అమరుల్లో ఒకడయాడు. ఏ

నాడయితే చెడ్డపిల్లవాడంటూ లేడు అని ఫాదర్ ఫ్లాన గన్ అన్నాడో, ఆనాడే ఆయన అమరత్వం ప్రారంభమయింది. మానవాత్మలో భగవదంశ వుందని ఆయనకు తెలుసు. ఆయన భగవదనుగ్రహాన్ని నమ్మాడు. కాలావకాశాలకి అతీత మైన ఆ భగవత్ శక్తే యిక్కడి పిల్లలని కూడా రక్షిస్తుం దన్నాడు. ఫాదర్ ఫ్లానగన్ అందరికీ మిత్రుడు. మతాలతోటీ జాతులతోటీ ప్రమేయం లేని సేవాధర్మం ఆయనిది. ఆయన గోరీమీద ఈ మాటలు రాశారు: బాలరాజ్య నిర్మాత ఫాదర్ ఫ్లానగన్–దేవుణ్ణీ మానవుణ్ణీ ప్రేమించాడు."

యూదులకి చెందిన రాబీ ఎడ్గర్ యఫ్. మాగ్నిన్ యిలా అన్నాడు: "అబ్రహామ్‌వలె, వీధివాకిలి దగ్గర నుంచుని, చినిగిన బట్టలు వేసుకు మట్టిగొట్టిన మొహాలతో వున్న పిల్లలని ఆహ్వానించేవాడు. రెండు చేతులతోటీ వారిని ఆహ్వానించి, హృదయానికి హత్తుకునేవాడు. కొందరు నీగ్రోలు, కొందరు యూదులు, కొందరు కాథలిక్కులు, కొందరు వివిధ శాఖలకి చెందిన ప్రాటెస్టెంటులు,–ఏ మతానికీ చెందనివారు కొందరు– యిలా వీరందరూ బాలరాజ్యంలోనికి వచ్చి భగవంతు డొక డున్నాడని తెలుసుకునేవారు. ఫాదర్ ఫ్లానగన్ మరణం తీరనిలోటు కలిగించింది. మరొకరకంగా చూస్తే, ఆయన ఈ లోకంలోకి వచ్చిననాటికంటె, వెళ్ళిననాడు ప్రపంచం భాగ్య వంతమయింది. అమెరికనుల హృదయ సీమలలో ఆయన చిర కాలం నివశిస్తాడు."

లాస్ ఏంజిల్సులోని "సెంటినల్" పత్రిక నీగ్రోల తరపున ఈ సంపాదకీయం రాసింది: "ఆయన ఆశ్రయ మంది

రంలో అందరికీ చోటు వుంది. ఐరిష్ కాథలిక్ అయినా, నీగ్రో బాలుడయినా—ఎవరినైనా సరే ఫాదర్ ఫ్లానగన్ నిండుహృదయంతో ఆదరించేవాడు. అయిదు వందలమంది పెరా ట్రూపర్స్‌లో ప్రథమ బహుమతి పొందిన చెస్టర్ ఓడెన్ ఫాదర్ ఫ్లానగన్ బాలరాజ్యంలో చదువుకున్నాడు ఒకప్పుడు. ఫాదర్ ఫ్లానగన్ దగ్గిర చదువుకున్న నీగ్రో యువకులు ఎందరో వృద్ధిలోకి వచ్చారు. ఆయన ఉపదేశాలు వారి జీవితాలనే మార్చి వేశాయి."

## 2

ఐర్లెండులో 1886 జూలై 13వ తేదీ మంగళవారం నాడు ఎడ్డీ (ఫ్లానగన్) జన్మించాడు. ఫ్లానగన్ కుటుంబం ఒడ్డూ, పొడవులకి ప్రసిద్ధి—కాని యితను పుట్టడమే చాలా పీలగా పుట్టాడు. నాలుగో నెలనో, మూడో నెలనో చిన్నబిడ్డ దోషం (కన్‌వల్సన్) వచ్చింది; వొళ్ళంతా ఎర్రగానూ, నీలంగానూ అయిపోయింది. అతని సోదరి నెల్లీ (పెద్దయాక బాలరాజ్యానికి జీవితాన్ని అంకితం చేసినవారిలో ఒకతె) చెప్పింది: భగవత్ప్రార్థనల వల్లనే తన చిన్నతమ్ముడు రక్షింపబడ్డాడని.

ఒక్కడూ కూచుని మాటా మంతీ లేకుండా ఏదో దూరంలోకి చూస్తూండేవాడట ఎడ్డీ తన చిన్నప్పుడు. చిన్నబిడ్డ దోషంనుంచి బయటపడ్డాక కుర్రాడు మారిపోయాడు అంటుంది నెల్లీ.

ఎడ్డీకి నాలుగేళ్లు వచ్చాయి. సన్నగా అర్భకాకారిగా ఉండేవాడు. ఎడ్డీ తండ్రీ, తల్లీ, తాత, మిగతా పిల్లలూ, పొలంలోనే ఒక యిల్లు వేసుకుని, అక్కడ వుంటూండేవారు.

లీబెగ్‌లో తండ్రి పొలంపని చూసుకుంటూ ఉండగా, నాలుగేళ్ల వయసుగల ఎడ్డీ ఎల్లవేళలా తండ్రిని అంటిపెట్టుకు నుండేవాడు.

దగ్గరలోనే వున్న నది దాటితే పట్నం కనిపించేది. ఆ పట్నం పేరు బాలిమో. చర్చి ప్రార్థనలకని అక్కడికి వెళ్తూం డేది ఫ్లానగన్ కుటుంబం. ఇంకా కొన్ని మైళ్ళదూరాన డ్రిమ టామ్‌పల్‌లో ఇంగ్లీషువారు ఐర్లాండులో స్థాపించిన "జాతీయ పాఠశాల" ఒకటి ఉండేది. రాస్‌కమాన్ అను గ్రామం వీరు నివసిస్తూన్న పొలానికి పదిమైళ్ళ దూరంలో ఉండేది. వస్తువులు కావలసి వుంటే, బండిలో వెళ్ళి అక్కడనుంచి తెచ్చుకునే వారు. మరికాస్త దూరంలో కాసిల్‌రా (పెద్దపట్నం) ఉండేది. ఎక్కువ సరుకులు కావలసి వచ్చినా, ఆడవాళ్ళ షాపింగ్ అన్నా అక్కడికి పెట్టెబండిలోనో, సైడ్‌కార్‌లోనో వెళ్ళేవారు.

డ్రిమటామ్‌పల్‌లో బళ్ళో చేరాకకూడా ఎడ్డీ తన తండ్రికి పొలం పనిలో సాయపడుతూండేవాడు. యింటిల్లిపాదీ ఎడ్డీని "పుస్తకం పురుగు" అని పిలిచేవారు. గొర్రెలూ ఆవీ కాస్తున్నప్పుడుకూడా ఎడ్డీ చేతుల్లో స్కాటు రాసిన నవలో, డికెన్సు రాసిన నవలో, లేక మెకాలే గ్రంథమో ఉండేది.

తోడి పిల్లలతో ఏవైనా పేచీలు పెట్టుకునేవాడా అంటే మనకి ఈ జవాబు దొరుకుతుంది. ఫ్లానగనే చెబుతాడు తను బాల్యంలో చేసిన మూడు అపరాధాల గురించి.

(1) వెనక టర్కీ దేశపురాయబారిగావున్న సర్ నికోలస్ తోటలో ప్రవేశించి యాపిల్ చెట్టు ఎక్కాను. యాపిల్ చేతికి అందక పూర్వమే తోటవాడు పట్టుకున్నాడు. ఫిర్యాదు

అన్నయ్య దగ్గిరికీ నాన్న దగ్గిరికీ వెళ్ళింది. చివరికి అమ్మ దగ్గిరికి కూడాను.

(2) కొట్టు వెనకాల నక్కికూచుని ఒకపాత పొగాకు పైపు కాల్చాను. నేను చేసిన తప్పు ఎవరూ కనిపెట్టలేక పోయారుగాని, మూడుగంటలసేపు కడుపులో దేవినట్లయి మహా బాధపడ్డాను.

(3) అనవసరంగా నా మీదికి వస్తున్న ఒక పొగరు మోతు కుర్రాణ్ణి చిత్తుచేశాను; నేను పోరాడింది ఒక్కసారే. అదైనా ఆత్మ సంరక్షణార్థం.

ఈ మూడే తను చేసిన అల్లరి పనులు. అంతకి మించిన అల్లరి ఎరగడు ఫ్లానగన్.

*                    *                    *

చీకటి పడుతోందనగా వీధిముందు కనిపించే మంచు తెర, టీ కోసమని కాగే నీటి ఆవిరీ—చిన్ననాటి జ్ఞాపకాలలో ఒకటి అంటాడు. తాతయ్యతో కలపి మొత్తం పధ్నాలుగురు వుండేవారు యింట్లో—నలుగురు మొగపిల్లలు, ఏడుగురు ఆడ పిల్లలు. హాలు గోడలకి దగ్గిర బంధువుల ఫోటోలు తగిలించబడి వుండేవి. అందులో చాలామంది న్యూయార్కు వెళ్ళినవాళ్లు.

ఎడ్డీ తొందరలోనే తెలుసుకున్నాడు—తాము చాలా మందికంటె అదృష్టవంతులని. తనకి కనిపించే ప్రతి కుర్రవాడికీ యింత మంచి యిల్లూ, యిన్ని సౌకర్యాలూ వుండేవి కాదు. చాలామందివి పూరి కొంపలు. వారితో పోల్చిచూస్తే, తాము నిజంగా భాగ్యవంతులు.

రాత్రి భోజనాలవేళ కొవ్వొత్తులు వెలిగించేవారు. భోజనం చేసే టేబుల్ చాలా విశాలంగా ఉండేది. ఎడ్డీ సోదరి అయిన నెల్లీ ఫ్లానగన్‌కి యిప్పటికీ జ్ఞాపకం వుంది: వాళ్ళఅమ్మ ఆడపిల్లలకి వంటా, కుట్టూ మొదలైన గృహకృత్యాలు నేర్పడం. తాతయ్యా పశువుల డాక్టరు. ఏ గొడ్డుకి రోగం వచ్చినా తాతయ్యా దగ్గిరికే వచ్చేవారు లీబెగ్ చుట్టుపక్కల వారందరూ.

కుటుంబ క్షేమం కోసం కుటుంబంలోని వ్యక్తులందరూ యితోధికంగా కృషి చెయ్యడం కుటుంబ ధర్మం అంటాడు ఫ్లానగన్. ఆ నమూనాలోనే బాలరాజ్యం నిర్మాణం జరిగింది. బాలరాజ్యంలోకి మళ్లేనే చిన్నప్పుడు తమ యింట్లోకూడా పియానో, యకార్డియన్, వయొలిన్, ఫ్లూట్ ఉండేవి. సాయంత్రపు ప్రార్థనలకి పూర్వం యింట్లోని ఆడపిల్లలు ఈ సంగీత వాయిద్యాలు వాయించేవారు. ఎడ్డీ కంఠం ఎత్తేటప్పటికి గంభీరనాదం వెలువడేది.

ప్రతి రాత్రీ ఫ్లానగన్‌లు దైవప్రార్థన సలిపేవారు. అరవై అయిదు సంకీర్తనలు చేసేవారు; అందరూ బిగ్గరగా పాడేవారు. అన్నగారైన ఫాదర్ పాట్రిక్, ఎడ్డీ చిన్నతనం గురించి ఎన్నో విషయాలు చెప్పాడు. అన్నగారి ప్రభావం తమ్మునిమీద చాలా వుంది. చిన్నప్పుడు అన్నగారే తమ్మునికి విద్య నేర్పేవాడు. పాట్రిక్ పై చదువుల కోసమని డబ్లిన్ నగరానికి వెళ్లిపోయాక, ఎడ్డీకి వేరొక ట్యూటర్ని ఏర్పాటు చేయవలసి వచ్చింది.

మృత్యుముఖం నుంచి ప్రార్థనలవల్ల రక్షింపబడ్డ ఎడ్డీ తన భావనా ప్రపంచంలోనో, పుస్తక ప్రపంచంలోనో మునిగి పోయేవాడు ఎప్పుడూ.

"వీడేదో గొప్పవాడవుతాడు," అనేవారు అత్తలు.

"సరేగాని-ఏమవుతాడు?" అనేవారు బంధువులు.

ఆ మాటలు లక్ష్యపెట్టేవాడు కాదు ఎడ్డీ. తన భవిష్యత్తు నిర్ణయించేందుకు కుటుంబపెద్దలు కలుసుకోవడం అతనికి ఆశ్చర్యహేతువు అయింది. తను ఏమవదల్చుకున్నదీ తనకి తానుగా ఏనాడో నిశ్చయించుకున్నాడు. తను చిన్న కుర్రాడప్పుడు, అమ్మ బాలిమో చర్చికి తీసుకువెళ్లింది. అక్కడ ఫాదర్ ఫెడర్‌స్టోన్ అమ్మతో అన్నాడు:

"ఎవరమ్మా ఈ బుద్ధిమంతుడు? వృద్ధిలోకి రాదగ్గ కుర్రవాడు."

"మా అబ్బాయే-ఎడ్డీ," అంది నోరా ఫ్లానగన్.

"మీ ఎడ్డీ మతగురువు అవుతాడు."

చిన్న కుర్రవాడూ, జుట్టు నెరిసిన తల్లీ ఒకరి నొకరు ఆప్యాయంగా చూసుకున్నారు. ఈ సంగతి ఎడ్డీ తల్లి నోరా యింట్లో ఎవరితోనూ అనలేదు. ఎడ్డీ కూడా ఎక్కడా అనలేదు. కాని యిద్దరికీ మనసుల్లో తెలుసు పైకి అనక పోయినా.

ఈలోగా కుటుంబ పరిస్థితిలో అనేక మార్పులు వచ్చాయి. తాతయ్య చనిపోయాడు. ఎడ్డీ అక్కగారైన నెల్లీ

న్యూయార్క్ వెళ్ళింది. మిగతా యిద్దరు అక్కలూ వివాహాలు చేసుకొని వారివారి యిళ్ళకు వెళ్ళిపోయారు.

డబ్లిన్‌నుంచి అన్నగారైన పాట్రిక్ వచ్చాడు. ముందు సావిట్లో కుటుంబ పెద్దలు కొలువుదీర్చి కూచున్నారు. మొట్ట మొదటనే ఎడ్డీ చెప్పాడు తన మనసులో ఏమున్నదో. మత గురువు అవడమే తన అభిలాష అని వ్యక్తం చేశాడు. ఏ ఒక్కరూ కాదనలేదు; అందరూ ఒప్పుకున్నారు.

"భగవంతుని సంకల్పమేమిటో ఫాదర్ ఫెడర్‌స్టోన్‌కి తెలుసుగనక ఆనాడే ఎడ్డీని అలా దీవించాడు. మతగురువు అవడానికే ఎడ్డీ జన్మించాడు," అంది నోరా ఫ్లానగన్.

ఆరాత్రే ప్రయాణం చేశారు ఎడ్డీని స్లిగో నగరంలోవున్న సమ్మర్‌హిల్ కాలేజీకి. వెనక పాట్రిక్ కూడా అక్కడే చదివాడు.

## 3

ఆకాలపు అభిప్రాయాల ప్రకారం సమ్మర్‌హిల్ మంచి స్కూలే. మామూలు స్కూళ్ళకంటె మెరుగు. టీచర్లు కుర్ర వాళ్ళని జాగ్రత్తగా కనిపెడుతూండేవారు. శిక్షణ గరపడమే తెలుసుగాని, ఆదరంతో చూడటం వారికి తెలియదు.

సమ్మర్‌హిల్‌లోని విద్యార్థులకి యింటిమీద బెంగ (హోమ్‌సిక్‌నెస్) ఎక్కువగా ఉండేది. తల్లిదండ్రులకు దూరంగా వుంటారు గనక, చెప్పలేని దిగులుతో బాధపడే వారు పిల్లలు. పెద్దయాకకూడా ఫ్లానగన్ ఆ దిగులుకి సంబంధించిన స్మృతులు మర్చిపోలేక, తన దగ్గిరవున్న టీచర్లకి

ఈమాట చెబుతూండేవాడు: "మానవ హృదయంలోని వెలితిని భౌతికమైనవేవీ కప్పలేవు."

ఆ రోజుల్లో బాలరాజ్యంగానీ, అలాటివిగానీ ఎక్కడా వుండేవి కాదు; ఉండటానికి ఆస్కారం కూడా లేదు. డబ్బు చెల్లించే విద్యార్థుల విషయంలో కూడా చాలా కఠినంగా ఉండేవారు—కఠినంగా వుంటేగాని శిక్షణ అలవడదని. పిల్లలు స్వతస్సిద్ధంగా అల్లరి సజ్జు అనీ, వారిలో దుష్టత్వమే ప్రకోపించి వుంటుందనీ, మొండిగా వుండే పిల్లలకి బడితపూజ తప్పితే మరొకమార్గం లేదనీ అనుకునేవారు. చెడుగుణాలు పైకి పొక్కక పూర్వమే వారిని అదుపులో పెట్టడం మంచిదని భావించేవారు ఆనాటి టీచర్లు. మరీ అవిధేయుడుగా వుంటే బళ్ళోనుంచి పంపించేసేవారు.

రిఫర్మేటరీ లవనీయండి, అనాథాశ్రమా లవనీయండి ఎక్కడయినా సరే ఈ మాఢ్యం, క్రూరత్వం ప్రబలంగాఉండేవి. కొన్నిచోట్ల పిల్లలని పశువులకంటె హీనంగా చూసేవారు. "కమ్చీ పుచ్చుకో; చావమోదు," ఈ మాటలు తరుచూ వినిపించేవి. అన్నివిధాలా పిల్లలని నలిపేసేవారు. సమ్మర్ హిల్ కూడా అదేమాదిరిది.

ఫ్లానగన్ కష్టపడి చదివే కుర్రవాడు కాబట్టి, బాధలేమీ ఉండేవి కాదు. అతనికి మార్కులు కూడా బాగానే వచ్చేవి. అయినప్పటికీ, ఆత్మవిహీనమైన ఆ పరిసరాలు అతన్ని ఎంతో కలవరపరిచేవి.

అది రాత్రివేళ. తన క్లాస్‌మేట్ అయిన మార్క్‌ని బళ్లోనుంచి పంపించేస్తున్నారు. గోడ చాటుకు వెళ్ళి, దాల్చిన

చెక్కతో చేసిన సిగరెట్టు పీల్చివచ్చాడు మాక్—అదే అతను చేసిన బ్రహ్మాండమైన నేరం. అందుకని అతనిని అవమానపరచి బళ్లోనుంచి పంపించేస్తున్నారు. ఎడ్డీకి తను రహస్యంగా కాల్చిన పైప్ సంగతి జ్ఞాపకం వచ్చింది. బయటికి తెలియలేదుగాని తెలిస్తే యింకేముంది? బళ్ళో పనికిరాడని యింటికి పంపబటడం కంటె, విద్యార్థికి వేరే న్యూనత ఏంకావాలి?

బ్లాక్ మార్కులు యిచ్చి ఎందరో విద్యార్థులని యిళ్ళకి పంపించేవారు అంతకంటె చిన్న నేరాలకి కూడా. ఎక్కడ ఏ తప్పు చేస్తామోనని నిరంతర భయంలో బ్రతికేవారు పిల్లలు. అంత భయపెట్టి పెంచడం మంచిది కాదని ఎడ్డీకి లేతవయసులోనే తెలిసింది.

సమ్మర్‌హిల్ స్కూలులో అతనికి ఫస్ట్ మార్కులు వచ్చేవి. ఆటల్లో హాండ్ బాల్ ఒక్కటే ఆడేవాడు. తీరిక చిక్కినప్పుడు తను ఒక్కడూ షికారు వెళ్ళేవాడు. స్లిగో నగరపు రేవువైపు అలా షికారు వెళ్తున్నప్పుడే మాక్‌డెర్ మాట్‌తో పరిచయమయింది ఫ్లానగన్‌కి. ఈ మాక్‌డెర్ మాట్ ఓడల కంపెనీ ఏజంటు. ఎప్పుడూ పెద్ద కబుర్లు చెబుతూండేవాడు. ఒక రకంగా గప్పాలరాయుడూ; కోతలరాయుడూను.

"టిమ్మీ నోర్క్ జేబులో ఆరు పెన్నీలు వున్నాయి నా దగ్గిరికి వచ్చేటప్పటికి. ఇప్పుడో? అమెరికాలో ఒక పెద్ద హోటల్ వుంది. రాజకీయాలలో కూడా పాల్గొంటున్నాడట. అదృష్టమంటే అది. ఎందరిని అదృష్టవంతులుగా

చేశాడో తెలుసా ఈ మాక్ డెర్‌మాట్!" అంటూ, తను అమెరికా పంపడంవల్ల ప్రయోజకుడైన పురుషుల గురించి వర్ణిస్తుండేవాడు అతను. ఇలాంటి కథలు చెప్పడం అతనికి సరదా. తనవల్లనే వాళ్ళు అంతవారయారని, వారి ఖ్యాతిలో తనకి రావలసిన భాగం తను తీసుకుంటూండేవాడు.

"ఈ పృథ్వీస్థలిమీద అమెరికా వంటి దేశంలేదు, అబ్బాయ్—ఐర్లండ్ తరువాతనే అనుకో! మొట్టమొదట ఐర్లండ్, తరవాత అమెరికా," అనేవాడు మాక్ డెర్‌మాట్.

నెల్లీ దగ్గిరనుంచికూడా న్యూయార్కు వింతలగురించి ఉత్తరాలు వస్తూండేవి. ఎడ్డీకి ఆ ఉత్తరాలూ, ఈ మాటలూ మనసులో ఏవేవో ఆశలని చిగురింపజేశాయి.

వేసంగి సెలవులు లీబెగ్‌లో తండ్రిదగ్గిర గడిపేవాడు ఎడ్డీ. పొలం పనిలో సాయంచేసేవాడు పెద్దతనంపై బడుతున్న తండ్రికి. ఎలాగైతేనేం సమ్మర్ హిల్ చదువు నాలుగేళ్ళూ పూర్తయింది.

* * *

సమ్మర్ హిల్‌లో ఉత్తీర్ణతాపత్రం పుచ్చుకునేటప్పటికి పద్ధెనిమిదేళ్ళు నిండాయి ఎడ్డీకి. మనిషి పొడవయాడు—ఆరడుగుల పొడవు. మెత్తని జుట్టూ, నీలి నేత్రాలూ—కుర్రవాడు బాగుండేవాడు చూడటానికి.

ఆ ఏద సంవత్సరం అన్నగారైన పాట్రిక్ డబ్లిన్ మత విద్యాపీఠంలో చదువు ముగించి, మత గురువు అయాడు.

అతనికి అమెరికాలో నెబ్రాస్కా రాష్ట్రంలోని ఒక కొత్త పారిష్‌లో మత గురువుపని అయింది.

ఎడ్డీ కూడా డబ్లిన్‌లోని అదే విద్యాపీఠానికి వెళ్ళి, మత గురువు ట్రయినింగు పూర్తి చేస్తాడని అనుకున్నారు. కాని న్యూయార్కు నగరం నుంచి నెల్లీ ఫ్లానగన్ వచ్చి వుండటంవల్ల, అనుకున్నట్టు జరగలేదు.

నెల్లీ యిప్పుడు కాస్త ధైర్యంగల మనిషి అయింది. ఆమె కళ్ళలో నూతన కాంతులు కనిపింప సాగాయి. తల్లికీ తండ్రికీ న్యూయార్కు ఎంత గొప్ప పట్టణమో చెప్పింది. ఎడ్డీని డబ్లిన్ పంపడమెందుకనీ, తనతో పంపమనీ, అమెరికాలోనే చదువు పూర్తి చెయ్యవచ్చుననీ అంది.

భోజనాల దగ్గిర కూతురు చెప్పినమాటలు ఆ రాత్రి తలిదండ్రులు బాగా ఆలోచించారు. పిల్లలకి రెక్కలు వస్తున్నాయి ; అందరూ తలో దారినీ పోతున్నారు. ఎడ్డీ కూడా తమ దగ్గిర్నుంచి వెళ్ళిపోవడం బాధావహమే. కాని, అతని భవిష్యత్తు మాటో ? సరే అన్నాడు తండ్రి.

## 4

నెల్లీ చెప్పినట్టు ఎడ్డీకి అదంతా వినూతన ప్రపంచం. అంతా కళ్ళకి మిరుమిట్లు కొల్పుతూ వుంది.

ఎడ్డీ మేనమామలైన లార్కిన్స్ న్యూయార్కులో వున్నారు. వారు మంచి పలుకుబడిగలవారు. ఎడ్డీని ప్రధాన మతగురువుకి చాలా సులువుగా పరిచయం చెయ్యగలిగారు.

ఫ్లాన్‌గన్‌కి ఆ మొదటి పరిచయం చాలా బాగా జ్ఞాపకం ఉంది.

"మతగురువు అవాలని ఉందా? అందుకు చాలా మరమ్మత్తు అవసరం. నీ కిప్పుడు ఎన్నేళ్ళు?" అని అడిగాడు, ప్రధాన మతగురువు.

"పద్ధెనిమిది, యువర్ ఎక్సలెన్సీ!"

"డిగ్రీ ఉందా?"

"లేదు, యువర్ ఎక్సలెన్సీ."

ప్రధాన మతగురువు ఒకసారి తల పంకించి అన్నాడు "మతగురువు అయేందుకు చాలా చిన్న వయసే! అయినా ఫరవాలేదు. యిప్పట్నుంచీ ఉత్తమ శిక్షణ అలవరుచుకో వచ్చు."

మేరీ లాండ్ కాలేజీలో ప్రవేశించి, అక్కడ డిగ్రీ తీసుకుని రమ్మన్నాడు ప్రధాన మతగురువు. ఆయన మాటకి తిరుగులేదు. మేనమామల్లో ఒకతను కుర్రవాని కయే ఖర్చు తను భరిస్తానన్నాడు. ఎడ్డీ కాలేజీలో చేరాడు. మళ్ళీ మూడేళ్ళపాటు చదువు.

* * *

అంతా తలోదారీ పట్టుకుపోగా, ఐర్లండులోని ఫ్లాన గన్ కుటుంబం విడిపోయింది. పెద్దవాళ్ళయిన తలిదండ్రులు ఒంటరితనం భరించలేక, అక్కడ వున్న గొడ్డూగోదా, పొలంపుట్రా అమ్మేసి, నెమ్మదిగా అమెరికా చేరుకున్నారు.

న్యూయార్కులో తలిదండ్రులూ నెల్లీ కలిసి వుండే వారు. అందరికీ ఎడ్డీ గురించి దిగులుగా ఉండేది. చిన్నప్ప ట్నుంచీ ఎడ్డీకి జలుబూ జ్వరం తరుచూ వస్తూండేవి. కుర్రవాని ఆరోగ్యం ఎక్కడ చెడిపోతుందోనని మహాభయ పడుతూండేవారు. కాని, చిత్రమేమిటంటే అందరిలోకీ ఎడ్డీయే ధైర్యంగా ఉండేవాడు.

1908 క్రిస్మస్ రోజు ఉదయం విద్యార్థులందరూ సెయింట్ పాట్రిక్స్ కెథీడ్రల్ కి వెళ్లారు. లోపలి ప్రదేశమంతా క్రిక్కిరిసి వుంది. విపరీతమైన జనసమ్మర్దం. విద్యార్థులు ఒక మూలగా ఒకరినొకరు అంటిపెట్టుకు నుంచున్నారు. పాతకాలపు స్టీమ్ రేడియేటర్ నుంచి ఆవిరి ఎడ్డీ వీపుకి వెచ్చగా తగల నారంభించింది.

ప్రార్థనలు చాలాసేపు జరిగాయి. అంతసేపూ వెచ్చటి ఆవిరి ఎడ్డీ వీపుకి తగులుతూనే వుంది. ప్రార్థనానంతరం వీధిలోకి వచ్చేటప్పటికి మంచూ, చలిగాలీను. ఆ చలిలో నడిచి యింటికి వచ్చాడు ఎడ్డీ.

ఇంటికి రావడమేమిటి, పక్కమీదపడ్డాడు. ఓవర్ కోట్లూ కంబళ్ళూ ఎన్ని కప్పారో చెప్పలేము. కాని వణుకు తగ్గలేదు. ఆస్పత్రినుంచి డాక్టరు వచ్చాడు. తలిదండ్రులకి కబురు వెళ్ళింది. పరుగులమీద వచ్చారు వారు. ఎడ్డీకి డబుల్ న్యుమోనియా అనీ, అదృష్టం ఎలా వుందో చెప్పలేననీ అన్నాడు డాక్టరు. ఆనాడు పెన్సిలిన్ ఉందా, సల్ఫాడ్రగ్స్ వున్నాయా? న్యుమోనియా నెమ్మదిమీద తగ్గాలి—అంతే!

ముసలి తలిదండ్రులు కన్నీరు కార్చారు. "మత గురువు అవడం మాట దేవుడెరుగు మా అబ్బాయి బతికి ఖావుంటే అదే పదివేలు" అనుకున్నారు పెద్ద వాళ్ళిద్దరూ.

## 5

మూడు నెలల తర్వాత ఎడ్డీకి ప్రాణభయంలేదనీ, ఒక ఏడాదిపాటు చదువుమట్టుకు మానెయ్యాలనీ చెప్పారు డాక్టర్లు. పైకి అనలేదుగాని, చదువు మానెయ్యడం ఎడ్డీకి యిష్టంలేదు. ఫాదర్ ఫ్రాన్సిస్ డఫీతో తన మనోభావాలు చెబుతుండేవాడు. జబ్బు మంచంమీద నుంచి లేచి క్లాసులోకి వెళ్తానంటూండేవాడు.

"వొద్దు నాయనా, భగవంతుడు ప్రసాదించిన ఈ జీవితాన్ని యిష్టమొచ్చినట్టు వాడటానికి నీకు అధికారం లేదు," అనేవాడు ఫాదర్ డఫీ.

"భగవంతుడు జీవితాన్నిగాక జీవితానికొక పరమార్థాన్ని కూడా యిచ్చాడుగా!"

"మతగురువు అవడమే నీ జీవిత పరమార్థమని నువ్వు ఎందుకు అనుకోవాలి?" అని అడిగేవాడు ఫాదరీ.

"మరొక పనికి నేను పనికిరాను గనక."

అది తెగని సమస్యగా ఫాదరీ వొదిలేసేవాడుగాని ఫ్లానగన్ మనసులో నిశ్చితమైపోయింది. అన్నగారికి మల్లే తను మతగురువు అవాలనిగానీ, వెనక లీబెగ్‌లోని మత సంబంధ వాతావరణ ప్రభావంగానీ, యివేమీకాదు. మత

గురువు అవడమే తన నిజధర్మమన్న ఆత్మప్రబోధాన్ని విన్నాడు ఫ్లానగన్ ఆ జబ్బు గదిలో. కొందరు కవులుగా, కొందరు శాస్త్రజ్ఞులుగా, కొందరు వేదాంతులుగా పుడతారు; తను భగవత్ కార్యంకోసం పుట్టాడు.

మధ్యాహ్నం మూడు గంటలవుతుంది. బయట మబ్బుగా ఉంది. తలగడకి చేరబడి, కళ్ళు రెండూ మూసుకొని ప్రార్థనలో నిమగ్నుడై వున్నాడు ఎడ్డీ. పెదవులు కదలుతున్నాయి ప్రార్థనాగీతంలో. పరిచారకుడు మందు తీసుకొచ్చి, ముందు నుంచోడం ఎడ్డీకి తెలయనే తెలియదు. ప్రార్థనలో లీనమై వున్నాడు.

* * *

మర్నాడు ఎడ్డీ మంచందగ్గిరికి పుస్తకాలూ కాగితాలూ, పెన్సిళ్ళూ పుచ్చుకు వచ్చాడు పరిచారకుడు. "ఫాదర్ డఫే పంపించారు మీకు యివి. మంచంమీద కూచునే చదువుకోమన్నారు," అన్నాడు.

ఫాదరీ చెప్పినమీదట ఎడ్డీని రోజూ రెండు గంటల సేపు చదువుకోనిచ్చారు డాక్టర్లు. ప్రతి మధ్యాహ్నం ఫాదరీ ఫ్లానగన్ దగ్గిరికి వచ్చి కూచునేవాడు. అంత చిన్న వయసులో ఫాదర్ డఫేలాటి ప్రముఖవ్యక్తితో కలిగిన పరిచయం ఫ్లానగన్ జీవితానికి మెరుగు దిద్దింది.

ఇంకా కాస్త దగ్గు వస్తున్నప్పటికీ ఆఖరుకు ఫ్లానగన్‌ని ఆస్పత్రినుంచి విడుదల చేశారు; అతను కాలేజీకి హాజరవడానికి

విలయింది. ఎక్కువ శ్రమ పడకుండా చదవమని వార్నింగ్ యిచ్చారు ఆస్పత్రి డాక్టర్లు.

పరీక్షలు దగ్గిర కొస్తున్నకొద్దీ ఫ్లానగన్ అర్ధరాత్రివేళ దాకా, వెనక స్లిగోలో చదివినట్టు చదివేవాడు. అంత ఎక్కువ చదవవద్దని ఫాదరీ అనేకదఫాలు వారించాడు. పరీక్షలు దగ్గిర పడుతున్నకొద్దీ ఫ్లానగన్‌కు దగ్గు ఎక్కువయింది. ఆత్మ బలంతో నెగ్గుకు వచ్చాడాఏడు. అన్ని నెలలు జబ్బుపడ్డ కుర్రవాడు అంతమంచి మార్కులతో ప్యాసవడం టీచర్లందరికీ ఆశ్చర్య కారణమయింది. క్లాసులో ఫస్ట్‌గా వచ్చాడు.

కాని, ఆస్పత్రి డాక్టర్లు ఫ్లానగన్‌ని పరీక్షించి ఎంతో వ్యాకులపడ్డారు. మానుతూ మానుతూ వున్న వ్యాధి మానక మొండికేసింది. ఏ క్షణాన అయినా అది క్షయలోకి దింప వచ్చు. డాక్టర్లు ఒకరితో ఒకరు సంప్రదించుకున్న మీదట, పెద్ద డాక్టరు ఫ్లానగన్‌ని పిలిచి చెప్పాడు: "అబ్బాయ్, నువ్వు యింక చదువు మానెయ్యడం ఉత్తమం."

ఫ్లానగన్ పెద్ద డాక్టరు మొహంలోకి దీనంగా చూస్తూ, "మానేసి...?" అన్నాడు.

"నీకు పరిశుభ్రమైన పొడిగాలి కావాలి. పడమటని మీ వాళ్ళెవరూ లేరూ?"

ఫ్లానగన్ నిరుత్సాహంతో తన గదిలోకి వచ్చి, ఒక్కడూ కూచున్నాడు. బయట చిరుచీకటి; మనసులో కీకారణ్యం. పడమట అని కాదూ డాక్టర్లు అన్నారు! ఒమ హాలో వున్న అన్న చటుక్కున జ్ఞాపకం వచ్చాడు.

మర్నాడు ఎడ్డీ తల్లిదండ్రులకీ, అక్కకీ డాక్టర్లు బయట పెట్టిన రహస్యం నివేదించాడు. తన చదువు తాత్కాలికంగా ఆగిపోతుంది గనక అందరం నెబ్రాస్కా వెళదామన్నాడు.

ఒమహాఅడవిప్రదేశమనీ,నాగరికతకి దూరంగావున్నదనీ దురభిప్రాయంలో వున్నారు తల్లిదండ్రులు. అన్నగారైన ప్యాట్రిక్ ఆ విషయమై ఎన్ని ఉత్తరాలు రాసినా వాళ్ళు నమ్మలేదు.

"మన ఐర్లాండు లాగానే ఉంటుంది అది కూడాను. మనవాళ్ళెందరో వున్నారక్కడ," అన్నాడు ఎడ్డీ. ఒకపట్టాన వొప్పుకోలేదు వాళ్ళు ఒమహా వెళ్ళడానికి. కాని, ఎట్టకేలకు అంగీకరించారు.

*　　　*　　　*

ఒమహాలో ఫ్లానగన్ కుటుంబమంతా మళ్ళా సమకూడింది. కూతురు నెల్లీ, తల్లి నోరా వంటగదిలో ప్రవేశించారు. ఫాదర్ ప్యాట్రిక్ ఫ్లానగన్ గృహం బంధువర్గంతో కలకల్లాడింది. ఎన్నాళ్ళ తర్వాతనో అందరూ ఒకచోట సమకూడారు. లీబెగ్‌లోని వెనకటి రోజులు జ్ఞాపకం వచ్చాయి అందరికీ. అమ్మ తన చేతులతో తను వండిపెడుతోంది; గడ్డం తెల్లబడ్డ నాన్న డైనింగ్ టేబుల్ దగ్గిర కూచుంటే యింటికి నిండు వచ్చింది.

భోజనాల దగ్గిర అందరూ పాతకాలపు స్మృతులే మననం చేసుకునేవారు. ఎడ్డీ యాపిల్ దొంగతనం చెయ్యబోయి పట్టుబడటం; క్రిస్‌మస్‌కు బంధువులు ఎక్కువమంది

వచ్చినప్పుడు లీబెగ్ యింట్లో పడ్డ యిబ్బందులు; వాళ్ళ తిండీ-అదంతా ఒక కథ.

ఎడ్డీ గురించి అందరికీ మనసులో బెదురుగా ఉంది. ఈ మాదిరి అనారోగ్యంతో అతను మతగురువు ఎలా కాగలడా అను సంశయం అందరికీ ఉంది. కాని, ఏ ఒక్కరూ పైకి అన లేదు.

కొన్నాళ్ళు గడిచాక అన్నగారే కదిపాడు తమ్ముడితో ఈ విషయం. పాట్రిక్ పొడవుగా పుష్టిగా ఉండేవాడు. లోపల ఎన్ని సమస్యలు వున్నప్పటికీ, పైకి నవ్వుతూ సరదాగా మాట్లాడగల నేర్పరి అతను.

"మొండితనం పనికిరాదు. అంత ఎక్కువగా చదివి, యిలా తెచ్చుకున్నావ్!" అన్నాడు తమ్ముడితో.

"ఏమిటన్నయ్యా, నా ప్రయత్నం నుంచి విరమించ మంటావా?"

"ఇతరులు విరమించమంటారు—నేను కాదు. మత గురువు రాత్రనక. పగలనక కష్టపడతాడు. నీకు ఆ కష్టపడ గలిగే శక్తి లేదనుకుంటారు కొందరు."

"నేను ఎలాగో అలా ఆ శక్తిని సంపాదిస్తాను."

"అలా మొండిగా చదివి ప్రాణాలమీదికి తెచ్చుకో కూడదు."

ఇంచుమించు అవే మాటలు ఫాదర్ డఫీ కూడా అన్నాడు.

"మరి ఏమిటి చెయ్యడం?"

జవాబు తోచక అన్నగారు కిటికీ వూచలలోనుంచి చూస్తూండగా ఎడ్డీ అన్నాడు: "నేను చనిపోతానని అనుకోను—ఏమయినా, యిప్పట్లో చనిపోతానని అనుకోను. భగవంతుడు నాకు చేయూత నిస్తాడు."

అన్నగారికి తమ్మునిలోని విశ్వాసబలం ఆ క్షణాన గోచరమయింది. ఆ విశ్వాసమేగా కావలసింది!

అన్నగారి ప్రాపకంవల్ల ఎడ్డీ పెద్దపెద్ద చర్చి ఉద్యోగులని కలుసుకోగలిగాడు. గొప్ప అనుభవశాలి ఐన బిషప్ స్కానెల్ అన్నాడు ఎడ్డీతో: "నువ్వు వెళ్ళి నేర్చుకునేందుకు ఒక్కటే స్థలం కనిపిస్తోంది. కాని, నీ ఆరోగ్యం..."

"నా ఆరోగ్యానికేమండి—భేషుగ్గా ఉంది, యువర్ ఎక్సలెన్సీ. దగ్గు పోయింది. బరువు పెరిగింది. కాస్త బలంగా వున్నాను కూడా యిప్పుడు. ఆస్పత్రి డాక్టర్లు నా విషయమై పొరబడ్డారు. ఆ ఒక్క స్థలమేమిటో చెప్పండి, యువర్ ఎక్సలెన్సీ."

"రోమ్."

ఫ్లానగన్ తన చెవులని నమ్మలేకపోయాడు. ఈమారు మూలకూచుని అజరామర నగరం అయిన రోమ్ గురించి గాలిమేడలు కట్టుకోనడమా?

"మత సంబంధమైన విద్య నేర్చుకునే నిమిత్తం రోమ్ నగరానికి వెళ్ళగల అర్హత నీకు వుంది. నువ్వు అక్కడ చదువుకోవాలిగాని యివన్నీ ఎందుకు?" అన్నాడు బిషప్ స్కానెల్.

అమాంతంగా శంఖారావం విన్నట్టయింది ఫ్లానగన్‌కి
"ఆమహానగరమే నేనుదర్శించగలిగితే...?" అన్నాడు ఎడ్డీ పట్టలేని సంతోషంతో.

"మీ వాళ్ళనడిగి చెప్పు," అన్నాడు బిషప్.

కుటుంబ పెద్దలు మళ్ళీ ఒకసారి కూచున్నారు. తన దగ్గు తగ్గిందనీ, న్యుమోనియా తగ్గిపోయిందనీ ఎడ్డీ అన్నాడు.

ఆ వేసంగుల్లో ఎడ్వర్డు ఫ్లానగన్ ఒక్కడూ రైలులో న్యూయార్క్ వచ్చి, అక్కడ ఓడ ఎక్కాడు.

## 6

1907 అక్టోబరు 4వ తేదీన ఫ్లానగన్ రోమ్‌లో పాదం పెట్టాడు. అతను ప్రవేశించిన విశ్వవిద్యాలయం పేరు గ్రిగేరియన్ యూనివర్సిటీ. 1457 లో స్థాపితమయిందది.

ఫ్లానగన్ చదువుకునే రోజులలో ఆ విశ్వవిద్యాలయం జెసూట్ ఫాదరీల చేతుల్లో ఉండేది. వారే అక్కడి అధ్యాపకులు. పేరుకి జెసూట్లయినప్పటికీ వారి విద్యాబోధన ప్రాంతీయ తత్వాలకి అతీతంగా ఉండేది. వివిధశాఖలకి, వివిధ వర్గాలకి చెందిన క్రిస్టియనులు అక్కడ మతవిద్య నేర్చుకుంటుండేవారు. ప్రతి దేశం నుంచి, ప్రతి జాతినుంచి క్రిస్టియన్ విద్యార్థులు వస్తూండేవా రక్కడికి. ఆమాదిరి సమైక్యతాభావం కలిగిన కాథలిక్ విశ్వవిద్యాలయం మరొకటి లేదు. భగవత్ సేవకి జీవితాన్ని అర్పిద్దామనుకునే విద్యార్థులు అక్కడికి వచ్చి చదువుకునేవారు.

విద్యార్థులకి తీరిక అంటూ వుండేదికాదు. ఉదయాన ఏడుగంటలకి భోజనం ; తర్వాత సమూహారాధన ; ఎనిమిది గంటలకి క్లాసులు; మధ్యాహ్నం వేళ కాసేపు విశ్రాంతి; మిగతా సమయాలలో ఏవో పాఠాలు, లెక్చర్లూ, లైబ్రరీలూ, మ్యూజియమ్‌లూ—వీటితో తెరిపిలేకుండా ఉండేది. బోధన యావత్తూ లాటిన్ భాషలో జరిగేది.

ఊపిరి పీల్చుకోడానిక్కూడా వీల్లేనంత బరువుగా ఉండేది ఆ చదువు. సాయంత్రం వేళ మర్నాటి పాఠాలు చదువుకో వలసి వస్తూండేది. అందరికంటె బాగా చదవాలని ఫ్లానగన్ మళ్లా కష్టపడటం మొదలెట్టాడు.

వారానికి అయిదురోజులు లెక్చర్లు ఉండేవి. లక్ష్మీ వారాలూ, ఆదివారాలూ రోము నగర పరిసరాలలో వుండే చరిత్రాత్మక స్థలాలూ, పుణ్యస్థలాలూ చూడటానికి వెళ్ళేవారు విద్యార్థులు. ఆనాటి విద్యార్థులలో యిద్దరు—ఎన్‌రికొ డాంటీ (ఇటలీ), జాన్ విస్‌మరా (డెట్రాయిట్)—ఫ్లానగన్‌కి ఆప్త మిత్రులు అయారు. అతని బాలరాజ్యం చూడటానికి పనికట్టుకు వచ్చారు ఈ మిత్రులు—నలభై ఏళ్ళ తర్వాత. ఆ స్నేహ బాంధవ్యమే వేరు.

*   *   *

ఇటలీలో చలికాలం ప్రారంభమయింది. అది నవంబరు నెల. రోమ్ పట్టణంలో కనీ వినీ ఎరగనంత చలి. మంచు వర్షాలతో ప్రతిదీ గట్టుకుపోతోంది. ఒమహా పొడిగాలి వల్ల మాయమైన దగ్గు ఈ చలిగాలితో మళ్ళా ప్రత్యక్షమయింది. చిన్నప్పుడు మెలిక తిరిగిన పాదం బాగా వాచింది.

తన అస్వస్థతని మరిచేందుకు ఫ్లానగన్ మరీ ఎక్కువగా చదవడం మొదలెట్టాడు. ఒకవంక అనారోగ్యం, మరొకవంక శక్తికి మించిన అలసట–వాటితో ఫ్లానగన్ ఆరోగ్యం మళ్ళీ మొదటికి వచ్చింది. బరువు తగ్గింది; దగ్గు ఎక్కువయింది.

జనవరిలో అధ్యాపకులలో ఒకాయన ఫ్లానగన్‌ని, అంత కష్టపడి చదవవద్దని వారించాడు. "నీలాటి మొండివాళ్ళని చాలామందిని చూశాను ఫ్లానగన్! కాస్త తక్కువ చదువుతే ఏమొచ్చింది? లేకపోతే..."

జనవరి నెలాఖరుకి యింకా చిక్కిపోయాడు ఫ్లానగన్. విశ్వవిద్యాలయానికి చెందిన ఆస్పత్రికి తప్పనిసరిగా పోవలసి వచ్చింది. బరువైన హృదయంతో వెళ్ళాడు. పూర్వపు రోజులు జ్ఞాపకం వచ్చాయి. తన అనారోగ్యాన్ని తిట్టుకున్నాడు.

"అనవసరంగా నిన్ను నువ్వు శిక్షించుకుంటున్నావు–వొట్టి మూర్ఖత. ఎక్కువసేపు చదవవద్దని కాదు నేను చెబుతున్నది. ఈ చదువు యిక్కడితో కట్టిపెట్టి, తిన్నగా మీ యింటికి వెళ్ళిపో," అన్నాడు ఆస్పత్రి డాక్టరు.

"చదువు మానెయ్యకపోతే...?" అని అడిగాడు ఫ్లానగన్.

"చదువు మానెయ్యాలని శాసించే అధికారం నాకు లేదనుకో. నువ్వు యిక్కడ రోమ్‌లో వుంటే యింక ఎన్నాళ్ళో బ్రతకవు."

*      *      *

1908 జనవరి 27న మతగురువు కాలేకపోయిన ఫ్లానగన్ మళ్ళా ఓడ ఎక్కి, అట్లాంటిక్ మహాసముద్రం దాటి, ఒమహా చేరుకున్నాడు.

ఫ్లానగన్‌కి తను ఏమి కానున్నాడో తెలియలేదు. తను మతగురువు కాక ఏమవాలి? ఒక రోజున తను నిర్భాగ్య బాలురందరికీ పితృసమానుడు కాగలడని ఎలా అనుకోగలిడు ఫ్లానగన్ ఆ నిస్పృహ పరిస్థితిలో?

కుటుంబమందరూ ఒమహా స్టేషనుకి వచ్చారు. తెచ్చి పెట్టుకున్న సంతోషం అందరి మొహాలలోనూ విలసిల్లింది. కఠినంగా ఎవ్వరూ ఏమీ అన లేదు. "నేను వెనక చెప్పానుగా!" అన్న నిస్సారమైన అల్పవాక్యం ఏ ఒక్కరూ అన లేదు.

ఎడ్డీ భవిష్యత్తు ఏమిటని భోజనాలదగ్గిర మాటలు వచ్చినప్పుడు, తను యిలా అస్వస్థుడిగా ఒకరిమీద ఆధార పడుతూ వుండటం ఎలా కుదురుతుందన్నాడు.

"నేను ఏదో ఒకపని చెయ్యాలికదా! ఇలా తింటూ కూచుంటే ఎలా? ఏదో ఒకపని చెయ్యాలని వొప్పు కుంటారుగా!"

కనుబొమలు ముడివేసి అన్నగారు అన్నాడు: "నిజమే–కాని నీ ఆరోగ్యం ముందు చూసుకోవాలని భగవంతుని ఆదేశమై ఉంటుంది."

వసంతోదయ మయింది. వెచ్చదనంతో బాటు మంచు దుప్పట్లు కరిగిపోయాయి. అన్నగారూ, డాక్టర్లూ చెప్పినట్టు

వినడానికి అంగీకరించాడు ఎడ్డీ. పుస్తకం ముట్టకుండా ప్రకృతి లోకి చూస్తూ, తనకి తానుగా ఆకాశహర్మ్యాలు నిర్మించుకుంటూ కాలం గడిపేవాడు.

ఈ ఏకాంతపు వేళలు అతని మనసు స్థిమితపడడానికి సాయపడ్డాయి. పరుగెత్తి పాలుతాగడంవల్ల ఫలితం లేదని తెలిసింది. తను జీవించడమేగాని జీవన క్రమాన్ని నిర్ణయించ లేనని తెలుసుకున్నాడు. జీవనక్రమం భగవదధీనం. భగవ దేచ్ఛ ప్రకారం తను జీవించాలి. జీవనక్రమం, ఆ క్రమ ప్రయోజనం దానంతటదే కాలక్రమేణా తెలుస్తుంది. తను తొందరపడి లాభంలేదు. పైకి స్థిమితంగా వున్నట్టు కనిపించేది కాని లోపల ఏదో బాధ.

వేసవి గడిచింది. ఆరోగ్యం ఒక దారిని పడింది. బరువు పెరిగింది. మొహంలో కాస్త కళ వచ్చింది. వేసంగి అయాక వాళ్ళ ఫామిలీ డాక్టరు ఎడ్డీని మరొకసారి పరీక్షించి స్టెతస్కోప్ సంచీలో పెట్టుకుంటూ, ధైర్య వచనాలు పలికాడు : "ఫరవాలేదు—ఒక దారిలో పడ్డావ్ ! నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకుంటూ, ఏదో మామూలు ఉద్యోగంలో చేరు. మెదడుకి శ్రమ కలిగించే పని వొద్దు."

ఎడ్డీకి తలకొట్టేసినట్లయింది. ఏమంటున్నాడీ డాక్టరు ? తను మతగురువు అవాలని కదా చిరకాల వాంఛితం ? మత గురువు అవడమేకదా తన జీవిత పరమార్థం !

"మత గురువు చదువు నేను ఎప్పుడు ప్రారంభించ వచ్చు ?" అని అడిగాడు ఫ్లానగన్.

"నీకు శాస్త్ర శక్తి వచ్చిందన్నాను. ఏదో మామూలు పని, నలుగురూ చేసేపని చెయ్యగలిగేపాటి శక్తి వచ్చిందన్నాను. అంతేగాని, మత సంబంధమైన చదువు చదివే పాటి శక్తి నీకు లేదు—యిప్పట్లో రాదు."

ఆ కంఠధ్వని అధికారయుతంగా కనిపించింది. ఫ్లానగన్ లేత గుండె ఎంత కుమిలిపోతూందో డాక్టరుకి అనవసరం.

"బోలెడన్ని మామూలు ఉద్యోగాలు వున్నాయి. ఏదో కొద్దిపాటి శ్రమ, వేళకి పనికి వెళ్ళడం, వేళకి భోం చెయ్యడం, వేళకి యింటికి రావడం—అలాటిది."

ఫామిలీ డాక్టర్ అంతవరకూ చెప్పి వూరుకున్నాడు. తన మాటలు ఆ యువకుణ్ణి శూలాల్లా పొడుస్తున్నాయని గ్రహించలేకపోయాడు. ఇరవై రెండేళ్ల వయసుగల ఫ్లానగన్ డాక్టరు వెళ్ళిపోయాక చాలా సేపు ఏకాంతంగా కూచుని ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చాడు. ఎక్కువ బాధపడకుండానే గుండె రాయిచేసుకున్నాడు. "ఓర్పూ విశ్వాసమూ ఉంటే, భగవంతుడు చూపడా తన మార్గాన్ని తనకి?" అనుకున్నాడు.

కొద్దిరోజులు పోయాక తనకొక ఉద్యోగం లభించిందని చెప్పాడు యింట్లో. "నాకు చిన్నప్పట్నుంచీ లెక్కలంటే యిష్టం. ఆర్థిక విషయాలలో కూడా నేను నేర్పరిని. తొందరలో నేనొక ఆర్థిక వేత్తని కాబోతున్నాను. యివ్వాళో రేపటిలో కాదనుకోండి, తొందరలోనే కడ్ హై కంపెని అక

ఫ్రంట్ డిపార్టుమెంటులో నన్నొక గుమాస్తాగా తీసుకునేందుకు వారు అంగీకరించారు.''

కడ్ హై ఒమహాలోని మాంసపు పాకింగ్ కంపెనీలలో పెద్దది; మాంసం పాకింగ్ చేసి వివిధప్రదేశాలకి పంపు తుంది. ఐర్లాండ్ దేశపు పచ్చటి పొలాలలో గొర్రెలనీ, పశువులనీ కనిపెట్టే రైతు బాలుడు, కడ్ హై కంపెనీ వారి స్లాటర్ హవుస్ (వధ్యశాల)కి తీసుకు రాబడ్డ మేకలనీ, పశువులనీ లెక్కపెట్టడమా! ఏమిలోకం యిది?

# 7

అకవుంట్స్ డిపార్టుమెంటులోని కొత్త గుమాస్తాని కంపెనీలో వారందరూ వింతగా చూడటం మొదలెట్టారు. ఐర్లండు నుంచి న్యూయార్కు వచ్చాడు; న్యూయార్కు నుంచి రోమ్ వెళ్లాడు—ఏదో మార్కో పోలోలా వున్నా డనుకున్నారు. అతను ఆఫీసులో చేరిన నాటినుంచీ రకరకాల గుసగుసలు, ఏవో ఏవో మాటలు. అతను మతగురువు అవలేకపోయాడని అందరికీ తెలుసు.

గుమాస్తాల కళ్లకి ఎడ్వర్డ్ ఫ్లానగన్ ఒక హీరోలా కనిపించాడు—నిరాశ చెందిన సాహసుడు. కొందరు లోలోన నవ్వుకున్నారు; మరికొందరు సానుభూతి కనబరిచారు. ఫ్లానగన్ అందరికీ యిష్టుడేగాని వారితో కలిసిపోలేక పోయాడు. ఒక రోజు సాయంత్రం పని అయిపోయాక యింటికి వెళ్తున్నప్పుడు హాంక్ అను మరొక గుమాస్తా ఫ్లానగన్‌ని పలకరించాడు.

"నీ దగ్గిర ఎప్పుడూ ప్రార్థన పుస్తకం ఉంటుంది కదూ. నువ్వు ఒకనాడు మతగురువు అయితీరతావు."

"అవును, నాకా నమ్మకం ఉంది హాంక్. ఆ సంగతి నలుగురితోటీ అనకు. ఇది మనిద్దరిమధ్యా వుండిపోవలసిన రహస్యం."

హాంక్ ఆ రహస్యాన్ని బయట పెట్టలేదు. తనొక నాడు మతగురువు కాగలననే ధైర్యం ఫ్లానగన్‌కి ద్విగుణీకృతం అయింది. వాళ్లివాళ్ళుమాత్రం ఆ ఆశలు పోదులు కున్నారు.

ఫ్లానగన్ తన ప్రస్తుత ఉద్యోగంలోని సులువు బలువు లన్నీ గ్రహించాడు. దినదిన ప్రవర్ధమాన మవుతున్న తమ కంపెనీలోని ఆర్థికవిధానం తెలుసుకున్నాడు. బాలరాజ్యం ప్రారంభించినప్పుడు ఈ వ్యవహారజ్ఞానం అతనికి ఎంతగానో ఉపకరించింది.

వేళపట్టున పనీ, భోజనం, తలకిమించిన బరువు లేక పోవడం—వాటితో ఎడ్డీ ఆరోగ్యం బాగుపడింది. 1909 లో చదువు గురించి మళ్ళీ యోచన ప్రారంభమయింది.

* * *

"ఇప్పుడు నీకు జబ్బూ గిబ్బూ లేదు. బాగున్నావు. పొడిగాలి వుండేచోట ఉద్యోగం చేసుకోడం మంచిది. ముఖ్యంగా పర్వత ప్రాంతాల దగ్గిర గాలి మంచిది నీకు," అని అన్నాడు డాక్టరు ఎడ్డీతో.

రెండేళ్ళ అనంతరం కుటుంబమంతా ఎడ్డీ భవిష్యత్తు ఆలోచించడానికై మళ్ళీ కూచున్నారు. ఇప్పుడు ఎడ్డీ పుష్టిగా ఉన్నాడు. ఆరోగ్యాని కేమీ లోటులేదు. డబ్బు యిబ్బంది కూడా యేమీలేదు. అందరూ తలో కాస్త సాయం చెయ్య వచ్చు.

ఫాదర్ పాట్రిక్ ఎడ్డీని యూరప్‌లో ఆల్ప్స్ పర్వత శ్రేణుల సమీపానవున్న విద్యాలయానికి పంపుదామన్నాడు. రోమ్‌లో వున్నప్పుడు ఫ్లానగన్ ఆ విద్యాలయం పేరు విన్నాడు; అక్కడ చదువుకువచ్చిన విద్యార్థులతో కూడా పరిచయం ఉంది. నీరసమైన ఊపిరి తిత్తులకి పర్వతాలగాలి మంచిదని చెప్పడంవల్ల ఎడ్డీని అక్కడికి పంపుదామని అను కున్నారు.

ఉత్తరాలు, అప్లికేషను ఫారాలూ ఈమాదిరి తతంగం అంతా అయాక ఆల్ప్స్ పర్వత శ్రేణులలోవున్న ఇన్స్‌బ్రక్ విశ్వవిద్యాలయంలో చేరేందుకు అట్లాంటిక్ మహాసముద్రాన్ని మళ్ళీ దాటాడు ఫ్లానగన్.

## 8

టైరల్‌లో మూడేళ్ళపాటు వున్నాడు. ఫ్లానగన్ నూతనోత్తేజంతో శక్తివంతంగా ఉండేవాడు. మంచుశిఖరాలకి పక్కగావున్న ఇన్స్‌బ్రక్ నగరంలోని ప్రతి వీథీ, ప్రతి యిల్లూ పురాతన వైభవాన్ని చాటుతూ పాతగాథలు చెప్పేవి.

* * *

1912 జులై 26 వ తేదీ ఉదయం సెయింట్ ఇగ్నాషియస్ చర్చిలో పూజా పునస్కారాలు తదుపరిని ఎడ్డీని

మతగురువుగా ఆమోదించారు. అతని జీవితంలో అదొక మహత్తర సమయం. ఆ పుణ్యకాలాన కుటుంబంగానీ, స్నేహితులుగానీ ఎవరూ దగ్గిర లేరు. మిగతా వారి బంధువులూ వాళ్ళూ వచ్చారు. కాని, తనవారు సముద్రానికి అవతల వున్నారు. రావడమంటే మాటలతో పనిగాదు. తనజీవితంలోని మహా పవిత్ర ఘడియలందు ఒంటరిగా వున్నాడు ఫ్లానగన్.

ఆ మర్నాడు మొట్టమొదటి సమూహ ప్రార్థన జరిపాడు ఎడ్డీ. అక్కడితో వచ్చినపని అయిపోయింది. పెట్టె సర్దుకుని మూడేళ్ళ అనంతరం ఒమహా చేరుకున్నాడు.

## 9

### "ఫాదర్ ఫ్లానగన్! ఫాదర్ ఫ్లానగన్!"

నెల్లీ, మరొక చెల్లెలు సుసీ, స్వాగతం చెప్పడానికి వచ్చిన వాళ్లందరూ "ఫాదర్ ఫ్లానగన్! ఫాదర్ ఫ్లానగన్" అన్నారు—ఎంతో సంతోషంతో ఒమహా నుంచి న్యూయార్కు వచ్చారు ఫ్లానగన్‌ని ఆహ్వానించడానికి.

అందరూ మేనమామ లింట కొద్దిరోజులు వున్నారు. ఫాదర్ ఫ్లానగన్ అమెరికాలోని తన మొట్టమొదటి సమూహ ప్రార్థన సెయింట్ యానీ చర్చిలో జరిపాడు. హడ్సన్ నది తీరానవున్న గ్రేస్ యినిస్టిట్యూట్‌లో మొట్టమొదటి బెనిడిక్షన్ సర్వీస్ జరిపాడు. తర్వాత తను నెల్లీ సుసీ ఒమహా రైలు ఎక్కారు.

బంధువులు ఫాదర్ ఎడ్వర్డ్ అని పిలుస్తూండేవారు ఫ్లానగన్‌ని. ఈమారు ఒమహా రావడం విజయోత్సాహంతో;

వెనకటికిమల్లే ఓటమితో కాదు. స్టేషనుకి వచ్చినవారి మొహంలో తెచ్చిపెట్టుకున్న నవ్వుగాక, నిజమైన సంతోషం ఉంది. అన్నగారి అధ్వర్యంలోవున్న హోలీ ఏంజిల్స్ చర్చిలో వచ్చిననాడే సమూహప్రార్థన జరిపాడు ఫ్లానగన్.

అన్నగారూ అతనూ 'ముందు సంగతి' గురించి కాసేపు మాట్లాడుకున్నారు. ఒమహా దగ్గిరలోనే వుందామనుకున్నాడు ఫ్లానగన్. కాని, అన్నగారు అలా కాదనీ, ఆ విషయం పై అధికారులు తేల్చి చెప్పవలసివుంటుందనీ అన్నాడు. వారం రోజు లయేటప్పటికి ఫ్లానగన్‌కి ఆర్డర్లు వచ్చాయి— ఒమహాకి రెండు వందలమైళ్ళ దూరంలోవున్న ఓనీల్ పట్టణంలో చేరమని.

* * *

అక్కడి సెయింట్ పాట్రిక్స్ చర్చి అధికారి పేరు ఫాదర్ మైకేల్. ముగ్గుబుట్టలా పండిపోయినజుట్టుతో ఎప్పుడూ ధ్యానముద్రలో మునిగివుండేవాడు ఈయనగారు. అవసరమయితేగాని పెదవి కదిపేవాడుకాదు. యోగక్షేమం అడగటం, వాతావరణం కనుక్కోవడం—యివే ఆయన మాట్లాడే మాటలు.

మాటా పలుకూ లేకుండా వుండటం కాస్త కష్టంగా వున్నప్పటికీ ఫాదర్ ఫ్లానగన్ ఆయనవద్దనుంచి యోచనా సమాధిలోని మహత్తు తెలుసుకున్నాడు.

ఫ్లానగన్‌కి చేతినిండా పనివుండేది. జబ్బుగా వున్నప్పుడు చూడటం, ప్రాణంమీదికి వచ్చినప్పుడు వెళ్లడం,

కుటుంబ తగాదాలు తీర్చడం యిలాటి వాటితో రోజల్లా అయేది. పరిసర ప్రదేశానికి గుర్రబ్బగ్గీలో వెళ్ళేవాడు; ఒక్కొక్క రోజున ముప్ఫయిమైళ్లు తిరగవలసి వచ్చేది. చలికాలంలో రెండుఅడుగుల దట్టాన మంచుపడి వుండేది రోడ్డు మీద. ఆ ప్రయాణాలలో ఒక్కొక్కప్పుడు అతని కాళ్ళూ చేతులూ కొంకర్లు పోయేవి.

చుట్టుపట్లనున్న ప్రజలు మంచివాళ్ళు. పాప పుట్టి నప్పుడో, తాత మరణించినప్పుడో, అబ్బాయీ అమ్మాయీ పెళ్ళాడ దలుచుకున్నప్పుడో వారికి మతగురువుతో పని వచ్చేది. చలిగాలి రివ్వున వీస్తున్నా లెక్కచేయకుండా చెప్పిన వేళకి హాజరయే ఫాదర్ ఫ్లానగన్ మీద వారికి ఎంతో అభిమానం. అతను వచ్చాడంటేనే వాళ్ల కెంతో సంతో షంగా ఉండేది.

ఫ్లానగన్ డాంబీకంగా ఉండేవాడు కాదు. తనచుట్టూ వున్న ప్రజలని ఎంతో ఆప్యాయంగా ఆదరించేవాడు. నిశ్శబ్దంగా తన పని తను చేసుకుపోయేవాడు. నిశ్శబ్దత అతనికి చిన్నప్పటినుంచీ అలవాటే! ఒంటరితనం అతనికి తెలియ నిదికాదు. లీబెగ్‌లో, హాస్పిటల్‌లో, పర్వతశ్రేణుల మధ్య- అదంతా ఒంటరి తనంగాక మరేమిటి? చలి మం చులో గుర్రబ్బగ్గీ ప్రయాణం యిట్టే అలవాటై పోయింది ఫాదర్ ఫ్లానగన్‌కి.

ఓనీల్‌లో కాస్త విశ్రాంతి చిక్కినప్పుడు, పాత గ్రంథాలు తిరగేసేవాడు. మతగురువుగా తను ప్రజలకి ఎంత

వరకూ ఉపయోగబడగలననీ; ఎటువంటి ప్రజాసేవ చెయ్య గలననీ నిరంతరం ఆలోచిస్తూండేవాడు.

ఫాదర్ మైకేల్ ఫ్లానగన్ మనసులోని ఆలోచనలు కనిపెట్టాడు. ఆరునెలలు అయాక మైకేల్ అన్నాడు: "ఇక్కడ నీకు ఒంటరితనం ఎక్కువగా వుండివుంటుంది."

"లేదే! అలాటిదేమీ లేదు ఫాదర్. ఇక్కడ నాకు ఎంతమందో స్నేహితులు వున్నారు. అంతేగాక, నేను అపూర్వ విషయాలెన్నో నేర్చుకుంటున్నాను," అన్నాడు ఫ్లానగన్ వెంటనే.

"వయసులో వున్నప్పుడు కదలిక కావాలనిపిస్తుంది. ఇంతకంటె ఎక్కువ అవకాశాలు వున్న చోటుకి నువ్వు వెళ్ళాలి. ఇక్కడ నీ పని నువ్వు సక్రమంగా పూర్తిచేశావు. అందుకని సువిశాలమైన స్థలానికి నువ్వు పోవలసి వుంటుంది."

ఫాదర్ మైకేల్ మనసులో ఏముందో ఫ్లానగన్‌కి తెలియదు. కొద్ది రోజులలోనే ఒమహా బిషప్ వద్దనుంచి ఆర్డర్లు వచ్చాయి. ఒమహా సెయింట్ పాట్రిక్స్ చర్చికి ఫ్లానగన్‌ని బదిలీ చేశారు. అక్కడ భగవంతుడు యితని కోసమై ఒక మహత్కార్యాన్ని అట్టేపెట్టి వుంచాడు.

## 10

1913 లో విపరీతమైన ఎండలు. ఎండల ఫలితంగా అనావృష్టి. పంటలన్నీ మాడిపోయాయి. పని నిమిత్తం అనేక మంది ఒమహా వైపుగా వచ్చారు. వీరందరికీ పని దొరుకుతుందా ?—దొరకలేదు. ఆ నిరుద్యోగులకి తనకి చేతనైనంతగా

సాయపడుతూ, తన భావి జీవితం రూపుదిద్దగల ఆశయాలకి సన్నిహితంగా వచ్చాడు ఫాదర్ ఫ్లానగన్.

ప్రతినెలా వందలకొద్దీ మనుషులు రైలుకంపెనీలోనో, మాంసం పాకింగ్ కంపెనీలలోనో ఉద్యోగంకోసం వస్తున్నారు-పిల్లామేకతో కూడా వస్తున్నారు. వీరికి ఉద్యోగాలు దొరకడం, లేదు సరిగదా పస్తులు పడివుండవలసి వస్తోంది.

గాలిలో తేలే ఈ కుటుంబాలకి తిండి పెట్టించి, ఉద్యోగాలు యిప్పించడం తన బాధ్యతగా భావించాడు ఫ్లానగన్. మొదటి రోజులలో యిబ్బంది వుండేది కాదుగాని రానురాను ఈ సమస్య అనావృష్టి కారణంగా తీవ్రరూపం దాల్చింది.

వేలాది పనివాళ్లు కాన్సాస్‌నుంచి బయలుదేరి, నలభై ఏభై సంఖ్యగల గుంపులలో ఉత్తరంగా వెళ్లి, కోతలు పూర్తి చేసుకు వచ్చేవారు. ఒక రాష్ట్రంలో కోత అయిపోయాక, పక్కరాష్ట్రానికి వెళ్ళేవారు. అమెరికాలోని పరిశుభ్రమైన పంట పొలాలు అక్కడే ఉండేవి-''అమెరికా రొట్టెలగంప'' అంటారు ఆ ప్రదేశాన్ని. పంటలకాలంలో తృణమో పణమో సంపాదించుకొని, చలికాలం ప్రవేశించేనాటికి ఒమహా చేరుకొని, చలికాలం వెళ్ళిపోయి వసంతంవచ్చేదాకా అక్కడ వుండి, ఆ తర్వాత స్వరాష్ట్రానికి వెళ్ళిపోయేవారు.

1913 వేసవిలో అంతా తలకిందులయింది. ఉత్తర దిశగా ఎంత ప్రయాణం చేసినా పంటలే లేవు. అన్నీ మాడిపోయాయి. ఒమహా చేరాక ఏదైనా పని దొరుకుతుందా అంటే, పనులు అంతకంటె లేవు-పంటల కరువువల్ల.

క్షుభిత హృదయాలతోనూ, దీనవదనాలతోనూ కని పించేవారు ఈ మనుషులు ఫాదర్ ఫ్లానగన్‌కి. ఏ సందుచివర చూసినా వీరే. అడుక్కుతిని బతికే బిచ్చగాళ్లు కాదు—పని వాళ్లు; పని దొరకని పనివాళ్ళు. డబ్బు యివ్వమని అడగటం లేదు వాళ్ళు—తిండీ బట్టా కోసం దేవులాడుతున్నారు.

ఫ్లానగన్ నెలసరి జీతం ఇరవైఅయిదు డాలర్లు. అందులో ఎంత అని యివ్వగలడు ఈ బీదవారికి? చర్చిద్వారా ఆహారం పంచిపెట్టే మార్గం ఆలోచించాడు. ప్రతిదినం వందల కొద్దీ నిరుద్యోగులు వూరిమీద వచ్చిపడుతూ వుండటంవల్ల, అదికూడా తలకిమించిన భారం అయింది.

ఫాదర్ ఫ్లానగన్‌కి మిత్రుడయిన కిరానా కొట్టతను ఒక డున్నాడు. ఇద్దరూ ఈ సమస్య విషయమై ఆలోచించారు.

"ఆ మనుషుల్ని అలా ఆకలిబాధతో మాడనివ్వడం ఎలా ?" అన్నాడు కిరానాకొట్టు ఆసామీ.

"కడుపునిండా తిండి పెట్టలేకపోతే పాయె, కాసిని కాఫీ నీళ్ళయినా పోస్తే..." అన్నాడు ఫ్లానగన్.

ఇద్దరూ ఒక అంగీకారానికి వచ్చారు. మతగురువు తన జీతంలో కొంతభాగం యివ్వడమనీ, కిరానాకొట్టు ఆసామీ తన ఖాతాదారుల చేతా, స్నేహితుల చేతా కొంత విరాళం యిప్పించడమనీ అనుకున్నారు. తిండిలేదని ఎవరైనా నిరుద్యోగి చర్చిదగ్గిరికి వస్తే, 'ఫుడ్ ఆర్డరు' రాసి యిచ్చేవాడు ఫ్లానగన్. అది కిరానాకొట్టువద్ద కాఫీకిందనో, పాలుకిందనో, పళ్లకిందనో మార్చుకోడానికి వీలయేది.

ఫుడ్ ఆర్డర్ల సంఖ్య నిర్ణీతమై ఉంది. కాని చర్చిగుమ్మం దగ్గిర "తిండి, బాబూ" అని ప్రాధేయపడుతూ పడివుండేవాళ్ల సంఖ్య పెరగజొచ్చింది. తిండి ఒక్కటే సమస్య కాదనీ, ఈ చలికాలంలో వాళ్ళు తలదాచుకునేందుకు స్థలం కూడా ఒకటి కావలసి వుందనీ ఫాదర్ ఫ్లానగన్ తెలుసుకున్నాడు. పట్టణ పెద్దలు ఈ విషయమై ఏమీ చెయ్యలేని స్థితిలో ఉన్నారు.

సెయింట్ విన్సెంట్ డిపాల్ సొసైటీకి విరాళాల సేకరణలో తనకి తోడ్పడిన ఒమహా వ్యాపారస్థుడు ఒకణ్ణి పిలిచి వున్న సంగతి చెప్పాడు ఫాదర్ ఫ్లానగన్.

"నా మట్టుకు నేను ఏమిచెయ్యగలనో చెబితే తప్పకుండా చేస్తాను," అన్నాడా వ్యాపారస్థుడు.

ఆ రాత్రి వీరిద్దరూ ఈ అభాగ్యుల దీనస్థితి చూడటానికి బయలుదేరారు. విపరీతమైన చలేమో, కొందరు కర్రపీపాలలో ముడుచుకుపడుకున్నారు; మరికొందరు పాతపత్రికలు దుప్పట్లమాదిరి కప్పుకున్నారు. అందరూ పని తెలిసి వున్నవాళ్ళే. కాని, పని దొరక్క వాళ్ళు నిరాశా పూరితులయారు. వాళ్లని కనిపెట్టే స్థితిలో లేరు ఎవరూ.

"పురప్రముఖులు ఏమీ సాయం చెయ్యలేరా?" అని అడిగాడు వ్యాపారస్థుడు.

"స్త్రీలకీ, శిశువులకీ పురప్రముఖులు సాయం చేస్తున్నారు. వీరికి లభ్యమవుతున్నదల్లా మేము ఇచ్చే ఫుడ్ ఆర్డర్స్," అన్నాడు ఫాదర్ ఫ్లానగన్.

"అయితే మనం ఏం చెయ్యాలి."

"భగవంతుని ప్రార్థిద్దాం. భగవంతుడే దారి చూపు తాడు," అన్నాడు ఫ్లానగన్.

ఆ రాత్రి అతనికి వివిధాలోచనలు వచ్చాయి. ఒక హోటల్ ప్రారంభిస్తేనో అనుకున్నాడు.

*　　　　*　　　　*

మర్నాడు ఫాదర్ స్మిత్‌తో తనకి తట్టిన ఆలోచన చెప్పాడు. ఇద్దరూ కలిసి బిషప్‌కి చెప్పారు. విషయం ఆ మూలాగ్రంగా విని బిషప్ అన్నాడు: "నీకు ప్రారంభించాలని వుంటే తప్పకుండా ప్రారంభించు. మా ఆశీర్వాదం, నైతిక సంపత్తి వుండనే ఉంటాయి. ఆర్థిక సహాయమంటావా, అది సాధ్యం కాని సంగతి—ప్రస్తుత పరిస్థితులలో."

ఫాదర్ ఫ్లానగన్‌కి నిరుత్సాహం కలగలేదు సరిగదా, పెద్ద సంతోషమయింది. ముందుకి సాగిపొమ్మని బిషప్ తనకి అనుమతినిచ్చాడు. అదే విజయసూచన. ఇప్పుడు ఆలోచించ వలసినదల్లా డబ్బు గురించి.

ఆ రాత్రి సెయింట్ విన్సెంట్ డిపాల్ సొసైటీ స్నేహితులని సమావేశపరిచాడు. అందరూ చిన్న చిన్న జీతగాళ్ళు. కాని, అందరూ తలొక అయిదూ, పదీ వేసుకుంటామన్నారు. హోటల్ ప్రారంభించేందుకు ముందు ఇల్లు ఒకటి అద్దెకి కుద రాలి. అందుకని ఆ మర్నాడు ఒమహా నగరవీథులు గాలిం చడం మొదలెట్టాడు ఫ్లానగన్.

కిరాణాకొట్టు ఆసామీ అన్నాడు: "ఉద్దేశం బాగానే వుంది. ఈ కొద్దిపాటి పైకంతో ఇల్లు ఎక్కడ దొరుకుతుంది అద్దెకి? పెట్టుబడిలేకుండా హోటల్ ప్రారంభించడం ఎలా?"

"పెట్టుబడా? విశ్వాసమే నాకు పెట్టుబడి," అన్నాడు ఫ్లానగన్.

రెండు రోజులు తిరిగాక బర్లింగ్టన్ హోటల్ అను పేరుగల ఒకపాత మేడ అద్దెకి కనిపించింది. ఎర్ర యిటుకల భవనం. ఈ మధ్యకాలంలో ఆ యింట్లో ఎవరూ నివశించి నట్టు తోచదు. కిటికీలూ, తలుపులూ చాలాచోట్ల పగిలి పోయాయి. ఆ యిల్లు చూసేటప్పటికి ఒక వజ్రం దొరికినట్ట యింది ఫ్లానగన్‌కి.

ఇంటి లోపలిభాగం ఎలా వుండాలో అలా వుంది! సాలిగూళ్ళూ, అంగుళంమందాన దుమ్మూ, గోడలనుంచి రాలిన పెళుసులూ—యిల్లు అద్భుతంగా ఉంది! రెండంతస్థుల మేడేమో, రెండవ అంతస్థు పైభాగాన వర్షపు రంధ్రం ద్వారా సూర్య చంద్రులు యింటిని పలకరిస్తున్నారు!

"కొద్దిగా రిపేర్లు చేయించవలసి వుంటుంది" అని యింటి యజమానే అన్నాడు. అడిగిన అద్దెకూడా స్వల్పమే! ఇంటికప్పు బాగుచేస్తేగాని ఆ అద్దె వొప్పుకోనన్నాడు ఫ్లానగన్. బాగు చేయించేందుకు అంగీకరించాడు యింటి యజమాని.

*　　　　　　*　　　　　　*

తను సాధించిన విజయం మిత్రులందరికీ నివేదించాడు ఫ్లానగన్. అందరూ సంతోషించి, యింకాస్త పైకం

విరాళంగా సమర్పించారు. బరువు అంతా ఫ్లానగన్ బుజాలమీద ఉంది. సోదరి నెల్లీ కూడా తనకి తోచిన సాయం చేయడానికి వొప్పుకుంది:

నిరాశ్రయు లందరూ వున్న ప్రదేశందగ్గరికి వచ్చి, ఫాదర్ ఫ్లానగన్ చెప్పాడు ఆరాత్రి: "మీకోసమని ఒక హోటల్ ప్రారంభించబోతున్నాను. అన్ని హోటల్స్ మాదిరికాదు. అది ఫక్తు మీకోసమే!"

వాళ్ళు వెర్రిగాచూశారు ఫాదర్ వంక. "మా దగ్గిర దమ్మిడీ లేదని తెలియదా మీకు?" అన్నారు.

ఫాదర్ ఫ్లానగన్ బర్లింగ్టన్ హోటల్ వర్ణించాడు. అది నిరాశ్రయులకోసమని ఏర్పాటు కాబోతోందనీ, కొద్ది రిపేర్లు మాత్రం వున్నాయనీ అన్నాడు. అప్పటికే నందమంది అతనిచుట్టూ చేరి, శ్రద్ధగా వింటున్నారు.

"మీకు కావలసిన పని చెయ్యగలవాళ్ళు మాలో ఉన్నారు. తాపీమేస్త్రీలూ, వడ్రంగులూ, సున్నం వేసేవాళ్లూ ఎవరు కావలిస్తేవాళ్ళు వున్నారు మాలో," అన్నారు వారు.

మర్నాడు బర్లింగ్టన్ హోటల్ నిండా పనివాళ్ళు. రిపేర్లు చకచకా సాగిపో నారంభించాయి. యిటుక, సున్నం, వార్నీషూ మొదలైనవి ఉదారులు కొందరు ధర్మంచేశారు. పనికిరాని కర్రసామాను ఎందరో కుటుంబీకులు బర్లింగ్టన్ హోటల్కోసమని యిచ్చేశారు. దీన్నంతటినీ బాగుచేసి, హోటల్కి పనికొచ్చేటట్టు చేసుకున్నారు వడ్రంగులు. పాత

వస్తువులనుంచే కుర్చీలూ, బల్లలూ, డస్కులూ రకరకాలైన
కర్రసామాను చేశారు.

పదిరోజులలో బర్లింగ్‌టన్ హోటల్ రూపు మారి
పోయింది. గోడలకి వెల్ల వేశారు; తలుపులకి రంగు పూశారు.
పాడుపడ్డ యిల్లు పది రోజులలో కొత్త యిల్లుగా మారి
పోయింది.

ఈలోగా ఫాదర్ ఫ్లానగన్ ఆహారపదార్థాల సేకరణకి
పూనుకున్నాడు. కిరానాకొట్టువాళ్ళూ, పాలవాళ్ళూ,
రొట్టెల కంపెనీలవాళ్ళూ అందరూ ఎవరికితోచినది వాళ్ళు
యిస్తామన్నారు. ఒక కొట్టతను ప్రతిరోజూ మణుగు చిక్కుడు
గింజలు సప్లయిచేస్తానన్నాడు. ఇంకో అతను రెండు మణుగుల
బంగాళాదుంపలు యిస్తానన్నాడు. ఆరోజు అమ్మకం కాని
పాలు యిక్కడ పోసేసి వెళ్ళేవారు పాలవాళ్లు. అలాగే
అమ్మకం కాని రొట్టెలు యిక్కడికి పంపించేవారు రొట్టెల
కంపెనీలవాళ్ళు. ఒమహాలోని స్త్రీలు బట్టా పాతా పంపుతూ
వుండేవారు. రొఖ్ఖపూర్వకంగా కూడా కొద్దో గొప్పో
విరాళాలు దొరుకుతూ వుండేవి.

పాడుపడ్డ బర్లింగ్‌టన్ హోటల్‌కి కొత్తదశ పట్టింది.
రాత్రీ పగలూ హడావిడి. మొదటినెల బాగానే గడిచింది.
రాబడీ, ఖర్చూ సరిపోగా కాస్త మిగులుకూడా కనపడింది.

## 11

మొదటి రోజులలో స్థలంకోసం తొక్కిడి వుండేది
కాదు. అనుమానాస్పదంగా, భయం భయంగా, లోనికి

రానిస్తారో రానివ్వరో అని జంకుతూ వచ్చేవారు. లోపల తమకి తెలిసిన వాళ్ళెవరైనా కనిపిస్తేగాని, ధైర్యంచేసి ప్రవేశించేవారు కాదు. మొదటి వారంలో బర్లింగ్‌టన్ హోటల్ 57 గురు అతిథులకి నిలువ నీడ నిచ్చింది. తర్వాత ఆ సంఖ్య వందదాకా దేకింది.

ప్రతి అతిథీ ఏదో ఒక పని చెయ్యవలసివుండేది. గదులు తుడవడమో, దుమ్ము దులపడమో, పక్కలు వెయ్యడమో, గిన్నెలు కడగడమో, వంటపనిచెయ్యడమో, బట్టలు వుతకడమో—ఏదో ఒక పని తప్పనిసరిగా చెయ్యవలసివుండేది. అప్పుడప్పుడు ఈ అతిథులలో కొందరు దుర్మార్గులు తమలో తాము కజ్జాలకి దిగినప్పుడు ఫాదర్ ఫ్లానగన్ అనేవాడు: "మీరు ఎక్కడ వుంటున్నారో మర్చిపోతే ఎలా? ఇది మీ యిల్లు కాదు—భగవంతుని యిల్లు."

ఏమైనా, రోజులు ప్రశాంతంగా వెళ్లిపోయేవి బర్లింగ్‌టన్ హోటల్‌లో ఒక దర్జీ షాపుకూడా ఏర్పాటయింది. ఫాదర్ ఫ్లానగన్ ఒక కుట్టుపనికొట్టు ఉండటం కూడా సంస్థకి లాభదాయకమనుకున్నాడు.

*  *  *

ఒకరోజు ఉదయం ముగ్గురు పెద్దింటి స్త్రీలు బర్లింగ్‌టన్ హోటల్‌కి విరాళాలు సేకరించేందుకు, ఆ సంస్థకి సేవ చేసేందుకు రాగా ఫాదర్ ఫ్లానగన్ ఆనందభరితుడయాడు. తన కృషిని అందరూ గుర్తిస్తున్నందుకు సంతుష్టాంతరంగుడయాడు.

ఆఫీసులో గుమాస్తాలు, ఎమ్ప్లాయ్ మెంట్ ఎక్స్చేంజి. వచ్చిపోయే జనం–బర్లింగ్టన్ హోటల్ ఎల్లవేళలా హడా విడిగా ఉండేది. సంపాదనలేని అతిథులు ఏమీ యివ్వనక్కర లేదు. సంపాదనగలవారు భోజనానికి అయిదేసి సెంట్లు చొప్పున సంస్థకి చెల్లించవలసి వుండేది.

ఎప్పుడూ వుండే అతిథులు 75 గురు ఉండేవారు. ఏ రాత్రి చూసినా వందమందికి తక్కువ వుండేవారు కాదు.– బర్లింగ్టన్ హోటల్ వందప్రాణాలని చలినుంచి కాపాడే దన్నమాట. స్థలంలేదని ఏ ఒక్కడినీ పంపినెయ్యడం జరగ లేదు.

*　　　　*　　　　*

శీతాకాలం అయేటప్పటికి సంస్థ దానంతటదే శ్రమ లేకుండా సాగుతూ ఉండేది. పెద్దయింటి స్త్రీలు యిక్కడి అతిథులకి గృహకృత్రాలు నేర్పడంలో ఎంతగానో సాయ పడ్డారు.

వసంతాగమనంతో పనివాళ్ళు తమ తమ ప్రదేశాలకి వెళ్లిపోదామనుకున్నారు. జూన్ నెలాఖరుకి యించుమించు అందరూ వెళ్లిపోయారు. బర్లింగ్టన్ హోటల్లో మునుపటి రద్దీలేదు. లెక్కలుచూస్తే నష్టమేమీ లేదు. బర్లింగ్టన్లో పైభాగాన్ని అతిథులు వారి వారిశక్తిని బట్టి అద్దెయిచ్చే పద్ధతిలో నడుపుదామనుకున్నాడు ఫ్లానగన్. ఏమయినా సీజన్ అయిపోయింది. ప్రస్తుతం ఆ సంస్థ అక్కడితో మూసేదామనుకున్నాడు.

కాని, యిల్లూ వాకిలీ లేక ఆకలితో మలమలమాడే నిర్భాగ్యులకోసమని ఒక ఆశ్రయం వుండి తీరాలనీ, అది పని

దొరకని పనివాళ్ళకేగాక, నిర్భాగ్యమానవ సోదరు లందరికీ పనికొచ్చేటట్టు వుండాలనీ అనుకున్నాడు ఫ్లానగన్.

అందుకోసమయితే ఈ బ్లరింగ్టన్ చాలదు. ఇంత కంటె పెద్దదికావాలి.

*    *    *

ఆ కొత్తహోటల్ పేరు లివ్‌సి ఫ్లాట్స్. నాలుగు అంతస్థుల మేడ-కింద బోలెడంత స్థలం. అద్దె కూడా ఏమంత ఎక్కువకాదు; చిన్న చిన్న రిపేర్లు, వెనక బ్లరింగ్టన్‌లో చేసినవారే ఈసారీ చేశారు.

ఈ ఏడు చలికాలం నీరుడంత అధ్వాన్నంగా లేదు. పంటలు పాడవలేదు గనక ఆ వచ్చిన మనుషుల చేతుల్లో నాలుగురాళ్ళు గలగలలాడేవి. "ఫాదరీ హోటల్ ఎక్కడ? ఫాదరీ హోటల్ ఎక్కడ?" అంటూ వెతుక్కుంటూ వచ్చారు నిరుటి మనుషులు.

కొందరు ఫాదరీతో అన్నారు: "మీరు ఈ మాదిరిగా అందరినీ యిక్కడికి చేరనిస్తే ఎలా? తుంటరులనీ, తాగు మోతులనీ చేరనిస్తే ఎలా? ఆ పైన కష్టాలు రావూ?"

ఫాదర్ ఫ్లానగన్ పెద్దగా నిట్టూర్పు విడిచాడు. వాళ్ళు చెప్పినది నిజమే! కాని సమస్యా పరిష్కారమెలా? తుపాకులతో నౌకర్లని నిలబెట్టమన్నారు కొందరు. వాళ్ళని తరిమెయ్యకపోతే ఫ్లానగన్‌కే ప్రమాదమన్నారు మరి కొందరుకీ

"మీ రన్నది బాగానే వుంది. కాని కిందభాగం అలాటి వాళ్ళకి వొదిలేస్తే..." అన్నాడు ఫ్లానగన్.

1914 వ సంవత్సరపు చలికాలంలో తాగుబోతులూ తుంటరులూ, నేరస్థులూ, హంతకులూ, దొంగలూ, గజ దొంగలూ-యిలాటి వాళ్లందరూ ఫాదర్ ఫ్లానగన్ హోటల్‌కి వస్తూండేవారు. అడుగుభాగాని కేగాని పైకిరావడానికి వాళ్లకి అవకాశం ఉండేది కాదు. ఆ పరిసరాలలోని పవిత్రత నేరగాళ్ళ హృదయాలని కలవరపెట్టేది. "మన సంగతి యింతే కదా" అని వాపోయేవారు వారిలో కొందరు.

## 12

ఫాదర్ ఫ్లానగన్ హోటల్‌కి రకరకాల మనుషులు వస్తూండేవారు. వీరూ వారూ అని లేదు-రౌడీలూ వుండేవారు; నిజాయితీగల మనుషులూ వుండేవారు. దిక్కులేని వారందరికీ ఆశ్రయమయింది ఈ హోటల్.

వచ్చిన అతిథిని ప్రశ్నలు అడిగేవారు కాదు. వాళ్ళే మయినా చెప్పదలుచుకుంటే వినడం-అంతే. వాళ్ల దగ్గర డబ్బు వుంటే ఖర్చులు యిచ్చేవారు; లేకపోతే లేదు. అక్టోబరు నెల వచ్చేటప్పటికి ప్రతిదినం అయిదువందలమంది అతిథులు అవు తూండేవారు. అందులో రౌడీ లెవరో కనిపెట్టి, వాళ్లని కింది భాగానికి పంపడం ఒక విద్య. కింది భాగం విషయమై ఎప్పుడూ ఒకకంట కనిపెడుతూ వుండేవారు. ఎందుకంటే అల్లరి మూకలకి స్థానమది. భిన్న ప్రవృత్తులుగల మనుషుల్ని సరిదిద్దుకు రావడంలో ఫ్లానగన్ నేర్పరి అయాడు.

ఫ్లానగన్ ఒకరోజు రాత్రి తన డెస్కు దగ్గిర కూచుని ఏవో కాగితాలు చూసుకుంటున్నాడు. ముప్పయ్యేళ్ల వయసు

గలయువకుడొకడుచడీచప్పుడూ లేకుండా ఫ్లానగన్ కి పక్కగా వచ్చి నుంచున్నాడు. అతను ధరించిన దుస్తులు ఖరీదైనవిగా ఉన్నాయి. తను ఆ రాత్రికి అక్కడ వుండవచ్చునా అని ఎంతో వినయంగా అడిగాడు ఫ్లానగన్ ని. తనదగ్గిర డబ్బేమీ లేదనికూడా ముందే చెప్పాడు.

"ఏమీ ఫరవాలేదు. రాత్రికి పడుకునేందుకు స్థలం చూపిస్తాను," అన్నాడు ఫ్లానగన్.

ఫాదరీ రకరకాల మనుష్యుల్ని చూశాడు గాని అర్థ రాత్రివేళ వచ్చిన ఈ కొత్త మనిషి వింతగా కనిపించాడతని కళ్లకి. తనేమిటో, తనెక్కడివాడో ఒక్క మాట కూడా చెప్ప లేదు ఆ వచ్చినతను.

మర్నాటి ప్రొద్దుటనుంచీ ఈ వింత మనిషిని గురించి ఎవరికి తోచినట్లు వారు భావించసాగారు. ఎన్నో పుకారులు ప్రచారం కాసాగాయి. కాని, అతను పెదవి మెదిపే వాడు కాదు. ఫ్లానగన్ అతనికి రాత్రిపూటల చెయ్యడానికి గుమాస్తా ఉద్యోగం యిచ్చాడు హోటల్లో.

వింతమనిషి చూపులకి పెద్దమనిషిలా ఉండేవాడు. ఎవరినీ పరుషవాక్యం అనేవాడుకాదు. "రాత్రివేళ హొటల్ కి వచ్చే తాగుమోతులనీ తుంటరులనీ సరిదిద్దగలడా యితను?" అని ఫ్లానగన్ మొదట్లో సంశయించాడు. కాని అలాటి వాళ్లని చిన్నపిల్లలని మందలించినట్టుగా మందలించేవాడు వింత మనిషి.

ఒకరోజు యిద్దరూ ఏకాంతంగా వున్నప్పుడు వింతమనిషి అన్నాడు: "ఫాదర్ ఫ్లానగన్, మీకు నా గురించి అనుమానాలు వుండి వుండొచ్చు. ఆ అనుమానాలతో మీ మనసు విరగక పూర్వమే నేనొక ముఖ్యవిషయం చెప్పవలసి వుంది. నేను గొప్పింటి బిడ్డని; రాజ కుటుంబాలకి చెందినవాణ్ణి. హంగేరియా దేశంలో ఒక కౌంట్‌ని."

*　　　*　　　*

కౌంట్ తన కథని యిలా చెప్పాడు: వాళ్ళది హంగేరీ. పెద్ద పెద్ద ఎస్టేటులు వున్నాయి వాళ్లకి. స్వదేశంలో బాగా చదువుకుని, ఉన్నత విద్యకోసమని అమెరికా వచ్చాడు. యూరప్‌లో యుద్ధం ప్రారంభమయింది. వాళ్ళవాళ్లు ఏమయారో తెలియదు. అక్కడనుంచి డబ్బువచ్చే అవకాశం లేదు. చేతిలో వున్నది అయిపోతూంది. ఉద్యోగం కోసం ప్రయత్నించాడు. కాని ఏ వృత్తిలోనూ అనుభవంలేని కారణాన ఉద్యోగం దొరకలేదు.

జేబులోవున్న డబ్బు కాస్త అయిపోవచ్చే వేళకి రోడ్డు పుచ్చుకున్నాడు కౌంట్. ఒక ఊరు తర్వాత ఒక ఊరు తిరగడం మొదలెట్టాడు. ఆ తిరుగుడులోనే రకరకాలైన చెడ్డ వాళ్లతో పరిచయమయింది. ఎవరో మాటల సందర్భాన చెప్పారు, ఒమహాలో ఫాదర్ ఫ్లానగన్ తిండిలేని వాళ్ళకి తిండిపెట్టే హోటల్ ఒకటి నడుపుతున్నాడని. అందుకని తిన్నగా యిలా వచ్చాడు ఆ హంగేరియన్ కౌంట్.

ఫాదర్ ఫ్లానగన్‌కి తన చరిత్ర ఎరుకబరిచిన తర్వాత, అందరికీ చెప్పడం మొదలెట్టాడు తన కథ ఆ కౌంట్. జమీం

డారుల వంశానికి చెందిన వాడొకడు తమతో బాటు వుంటున్నాడంటే, కొందరు సంతోషించారు; మరి కొందరు అది అంతా కట్టు కథ అన్నారు. అతను నిజంగా కౌంట్ అవనీ యండి, కాకపోనీయండి—పాదర్ ఫ్లానగన్ పట్ల ఎంతో భక్తి శ్రద్ధలతో ప్రవర్తించేవాడు. దుష్టుల చేతులలోనుంచి పాదరీని ఎన్నిసార్లో కాపాడాడు.

ఫ్లానగన్ జీవితం ప్రమాద భూయిష్టం. ఎంచేతననగా, ఎందుకూ పనికిరాని అల్పులూ నేరస్థులూ చేరుతూండేవారు ఈ హోటల్‌కి కాలం గడుస్తుంది కదా అని. పైకి నెమ్మదిగా కనిపించిన మనిషి కనురెప్పపాటులో దుండగీడుగా మారి మీదికి వురికేవాడు. ఒక రోజు రాత్రి ఫ్లానగన్ గుమ్మం దగ్గిర నుంచున్నాడు. భేతాళుడంత మనిషొకడు పాదరీకి దగ్గిరగావచ్చి, అతన్ని రెండు చేతులతోటీ పైకి ఎత్తి, ఒక మూలకి విసిరేశాడు. ఆ తాగుమోతు అక్కడితో వూరుకోక పాదరీ పీకె నులిమేద్దామని మీదికి వస్తూండగా, విద్యుద్వేగంతో కౌంట్ వచ్చి అడ్డుపడి, భేతాళుడంత మనిషినీ చిత్తుచేసి, తాగుమోతులూ, తుంటరులూ పడివుండే కిందభాగానికి పంపించాడు. తమాషా ఏమిటంటే, మర్నాటి పొద్దున్న ఆ తాగుమోతుకి రాత్రి జరిగిన సంఘటనలలో ఏ ఒక్కటీ జ్ఞాపకం లేదు.

*   *   *

హోటల్ జనాభా పెరగసాగింది. అయిదు వందలల్లా వెయ్యి అయింది. పాదర్ ఫ్లానగన్ అంటే ఎంతో భక్తి ప్రపత్తులతో ప్రవర్తించేవారు. సాయంత్రం వేళ యిక్కడా అక్కడా చతికిలబడి వూసుపోక కబుర్లు చెప్పుకునేవారు. అంతే

గాని, భగవంతు డొకడున్నాడనీ, ఆయన సేవకై కొద్ది కాలమైనా వినియోగించడం మానవధర్మమనీ వారికి తెలియదు. అందులో చాలామంది ఏనాడూ ఏ చర్చికీ వెళ్ళలేదు. దైవభక్తి అనేది వారిలో మచ్చుకి కూడా కనిపించదు. "దేవుడు వుంటే వుండవచ్చులే" అనుకునేవారు.

హోటల్ నిర్వహణలో అందరూ తలోకాస్త సాయపడేవారు. జేబులో డబ్బువుంటే తాము యివ్వవలసినది యిచ్చేవారు. మతం పేరూ, దేవుడి పేరూ చెబితే మొహం చాటేసేవారు.

"ఫాదర్, మా రోజులు వెళ్ళిపోయాయి. ఇంకా యిప్పుడేమిటి?"

"ఫాదర్, నేను చాలా తప్పులు చేశాను. ఇన్నేళ్ళయాక అలవాట్లు మార్చుకోగలనా?"

ఇలా సమాధానాలు చెబుతూండేవారు. వారు పిరికివారు కాదు; ధైర్యవంతులే. ఫ్లానగన్ హోటల్లోని వారెందరో మొదటి ప్రపంచ యుద్ధంలో వాలంటీర్లుగా చేరి, యుద్ధభూమిలో ధైర్య సాహసాలు ప్రదర్శించారు.

ఫ్లానగన్ హోటల్ కి అప్పుడప్పుడు కుర్రాళ్ళుకూడా ఆశ్రయంకోసమని వస్తూండేవారు. ఫాదరీ అలాంటప్పుడు యిరుకున పడేవాడు. ఈ పిల్లలని పెద్దవాళ్ళమధ్య, ముఖ్యంగా తాగుబోతులమధ్య తిరగనివ్వడం మంచిపని కాదు. అందుకని వారికి ప్రత్యేకం గదులు ఏర్పాటు చేశాడు. అవి పై అంతస్థులో ఒక పక్కగా ఉండేవి.

బాలరాజ్యం ప్రారంభానికి అది ప్రాతిపదిక.

## 13

తొమ్మిదేళ్ళ కుర్రవాడొకడు రాత్రివేళ ఫాదర్ ఫ్లానగన్ దగ్గిరకు వచ్చాడు. ఆ కుర్రవాని మొహం నూనె మరకలతోనూ దుమ్ముతోనూ, నల్లగా ఉంది; ఎర్రటి పూలు బనియను చినిగివుంది; వొంటిమీద కోటులేదు; నెత్తికి టోపీలేదు. కుర్రవాడు చలికి గజగజలాడుతున్నాడు.

"నల్ల సూట్‌లో వుండేమనిషి మీరేనా?" అని అడిగాడు ఆ కుర్రవాడు.

"అవును-నేను వేసుకున్నదీ నల్లసూటే!" అన్నాడు ఫ్లానగన్.

"నల్లసూట్‌లోవుండే మనిషితో నేను మాట్లాడవలసి ఉంది."

"ఏం కావాలి, నాయనా?"

"నేను ఇక్కడ వుండవచ్చా?"

ఈ మధ్య ఎందరు కుర్రవాళ్ళు ఈ ప్రార్థనతో తన దగ్గిరికి వస్తున్నారో కదా! కుర్రవానిని బుజ్జగిస్తూ అడిగాడు ఫ్లానగన్: "ఇక్కడ వుండాలని ఎందుకు అనుకుంటున్నావ్?"

"డబ్బు కట్టనిదే మీరు పిల్లలని వుంచుకోరా?"

"పెద్దవాళ్ళని వుండనిస్తాం-పిల్లలని కాదు. పిల్లలు ఎవరింట్లో వాళ్ళు వుండాలి."

"ఇల్లులేని పిల్లల సంగతో?"

ఫాల్‌కి యిల్లులేదు. పది పదిహేనురోజుల క్రితం తల్లి మరణించింది. తండ్రి చిన్నప్పుడే పోయాడు. ఈ వారం రోజులనుంచీ యిక్కడా అక్కడా తిరుగుతున్నాడు. నిన్న మధ్యాహ్నం నుంచి తినేందుకు ఏమీ లేదు.

"అబ్బాయ్ మొహమూ, చేతులూ కడుక్కో. భోజనానికి కూచుందాం," అన్నాడు ఫ్లానగన్.

పాల్‌కి కడుపునిండా భోజనంపెట్టి, పడుకునేందుకు వెచ్చటి పక్కయిచ్చాడు. ఆ రాత్రి ఫాదర్ ఫ్లానగన్ మనసు మనసులోలేదు. పాల్‌లాటి పిల్లలు అనేకమంది ఉన్నారు. ప్రభుత్వం వారి కేదోవిధంగా సహాయం చేస్తూవుండవచ్చు. ఏ తలిదండ్రులయితే తమ పిల్లల విషయమై తగిన శ్రద్ధతీసుకోరో, ఆ పిల్లలందరూ యించు మించు పాల్‌మాదిరిగానే అవుతున్నారు.

ప్రతిరోజూ పేపర్లలో పిల్లల నేరాలగురించిన కథలు; పోలీసులు వారిని పట్టుకొని, రిఫారమ్ స్కూల్స్‌కి పంపించడం—అదంతా మరొక కన్నీటిగాథ. ఆ పిల్లలు ఆ మాదిరిగా ఎందుకు తయారవుతున్నారు? లోపం ఎక్కడుంది?

ఫ్లానగన్ మనసుకి మరొక కొత్త ఆలోచన తట్టింది. మూడేళ్ళబట్టీ తను నిరాశ్రయులగురించి పాటుపడుతున్నాడు. పనిలేని వారికి పని కల్పించి, వారు సుఖజీవను లయేందుకు అవకాశం కల్పిద్దా మనుకున్నాడు. ఏదో కొద్దిమంది బాగు పడ్డారు. ఆ బాగుపడ్డవారిని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. మిగతావాళ్ళు ఎప్పటికి మల్లేనే ఉన్నారు; ఏ మార్పూ

లేదు వారిలో. దైవచింతనకూడా వారిలో కలిగించలేక పోయాడు. ఒక విధంగా తన కృషి విఫలమయినట్టే! వాళ్లకి ఈ మూడేళ్ళబట్టీ తిండిపెట్టి, తలదాచుకునేందుకు చోటు చూపించాడు. దేశదిమ్మరులకి అంతకంటె యింకేంకావాలి? "ఇంకా యిప్పుడు దేవుడేమిటి!" అంటారు వాళ్ళు.

పిల్లల విషయంలో అయితే అలా అవదు. తను ప్రారంభించడమే తప్పుదారిని ప్రారంభించాడు. మనిషిని బాగు చెయ్యడమంటే, అతని ఆత్మని తవ్వి బయటికి తీయడమంటే మాటలుకాదు. తను ఎందుకూ పనికిరాని పదార్థం పుచ్చుకు దేవుళ్ళాడుతున్నాడు.

బాల్యదశలో వున్నప్పుడే మనిషిని మంచిమార్గంలో పెట్టాలి ; అంతే గాని గడ్డాలూ, మీసాలూ వచ్చాక కాదు.

## 14

సంఘంలో నేరాలూ, అపరాధాలూ జరగకుండా వుండేందుకు ఒక్కటే మార్గం. చిన్నతనంలోనే మనుష్యుల్ని సన్మార్గంలో పెట్టాలి. మానవాత్మలో పాపభీతిని కలిగించి దైవభక్తిని నేర్పాలి ; అనగా పరమేశ్వరుణ్ణి ప్రేమించడం నేర్పాలి ; అప్పుడుగాని ఈ అపరాధాలు అంతంకావు.

న్యాయమొక్కటే సంఘశ్రేయస్సుని కలగచెయ్య లేదు. న్యాయానికి సాయంగా దయాగుణం వుండాలి. పోలీసులూ, అపరాధ పరిశోధకులూ దుర్మార్గులను అక్కడక్కడ ఏరుతారు. అంతేగాని దుర్మార్గత్వం మొదలంటా నిర్మూలించలేరు. ఇది సాంఘిక సమస్య మాత్రమేకాదు ; నైతిక సమస్య కూడాను.

ఫాదర్ ఫ్లానగన్ టైము దొరికినప్పుడల్లా మేస్ట్రీటు కోర్టుకి వెళ్తూండేవాడు. కేసుల విచారణ వింటూ, తద్వారా మానవస్వభావపు లోతులను గ్రహిస్తూండేవాడు. న్యాయాధికారులు ఫాదరీకి బాగా పరిచయమయారు. అప్పుడప్పుడు ఆయన్ని తమ ప్రయివేట్ ఛాంబర్స్‌లోకి పిలచి, ఆయన అభిప్రాయంకూడా తీసుకుంటూండేవారు తీర్పుల విషయంలో. న్యాయాధికారులు స్వతహాగా ఉదారబుద్ధి కలవారు. కాని వారి తీర్పు న్యాయసూత్రాలకి కట్టుబడి వుండాలి. అంచేత, ముఖ్యంగా పిల్లల కేసులవిషయంలో వారు ఉక్కిరిబిక్కిరి అవుతూండేవారు.

"చిన్నపిల్లలనీ పెద్ద పిల్లలనీ, తలితండ్రులు వున్నవాళ్ళనీ లేనివాళ్ళనీ, అందరినీ రిఫారమ్ స్కూలుకి ఎందుకు పంపిస్తారు– మరొక మార్గంలేదా?" అని అడిగాడు ఫ్లానగన్ ఒక జడ్జీని.

"ఏం చెయ్యమంటారు? యింటిదగ్గిర వాళ్ళు బాగు పడకపోవటంవల్ల వారిని ఎక్కడికో ఒకచోటుకి పంపాలి. అందు కని రిఫారమ్ స్కూల్స్‌కి పంపుతున్నాం," అన్నాడు జడ్జీ.

"ఎక్కడికో ఒక చోటుకి పంపాలి గనక రిఫారమ్ స్కూల్"– అని వినేటప్పటికి ఫాదర్ ఫ్లానగన్ గుండె ద్రవించింది. పశువుల మందలా తోలినంతమాత్రాన కుర్ర వాళ్ళు బాగుపడతారా?

ప్రతిరాష్ట్రంలోని ఉన్నతాధికారులకి బాలాపరాధులకు సంబంధించిన వివరాలకోసమై జాబులు వ్రాసి, బోలెడంత

సమాచారం సేకరించాడు. ఆ యా రాష్ట్రాలలో వుండే రిఫారమ్ స్కూల్సూ, వృత్తిపని విద్యాలయాలూ, అనాథ శిశుశరణాలయాలూ మామూలు పాఠశాలలూ–మొత్తం మీద తత్సంబంధమైన సమాచారం యావత్తూ తెలుసుకున్నాడు.

వేలకొద్దీ కేసు హిస్టరీలు చదివిన మీదట ఫాదర్ ఫ్లానగన్‌కి రెండు ముఖ్యవిషయాలు కనపడ్డాయి అన్ని కేసుల్లోనూ. ఒకటి: ఈ పిల్లలని ప్రేమతో చూసేవా రెవరూ లేరు; రెండు: భగవంతుడనేవాణ్ణి వీళ్లు మర్చిపోయారు. ఈ రెండు పరమసత్యాలూ మరచినప్పుడు మిగతా లెక్కలూ, అంచనాలూ శుష్కదండగ. మన స్తత్వం మాట అటువుంచి ఫాదర్ ఫ్లానగన్ పిల్లల కోసమూ, దేవుడి కోసమూ పోరాడాడు.

"పిల్లలు నేరం చెయ్యకుండా చెయ్యగలిగితే నేరాన్ని నిర్మూలించామన్నమాట. నేరాలు చెయ్యకుండా మన పిల్లలని కాపాడుకోలేకపోతే, ఈ నాగరికతే అంతమవుతుంది. అది మనం మర్చిపోకూడదు" అనేవాడు ఫ్లానగన్. స్థితిగతులు విచారించేందుకని ఒమహాలోని మేస్ట్రీట్ కోర్టులకి తరుచూ వెళ్తూండేవాడు. సమస్యని కూలంకషంగా పరిశీలించాడు. ఈ పోరాటంలో తలదూర్చేందుకు అన్ని హంగులూ ఏర్పాటు చేసుకున్నాడు.

*　　　*　　　*

స్వతహాగా దుర్మార్గపు మనస్తత్వాలుగల పిల్లలతో ఫాదర్ ఫ్లానగన్‌కి వెనకనే పరిచయం ఉంది. వీరి దుర్మార్గా

నికి కారణాలు : ఇంటిలోని కలతలు ; తమని చూసేవారు లేకపోవడం. ఇల్లు బాగుంటే పిల్లలలో చెడ్డతనం ఉండేది కాదు. హోటల్లో ఫాదరీకి చాలామంది పిల్లలతో పరిచయం కలిగింది. ఆ పిల్లలు ఫ్లానగన్ దగ్గిరికి పారిపోయి వచ్చేవారు.

పిల్లల సమస్యాపరిష్కారంలో న్యాయాధికారులక్కీ, ఫాదరీకి ఎంతో స్నేహం ఏర్పడింది. న్యాయాధికారులు ఫాదరీ కృషినీ, అతని అభిప్రాయాలనీ సాధ్యమైనంతవరకూ గౌరవింప సాగారు. ఒకరోజున ఒక జడ్జీ అన్నాడు ఫ్లానగన్‌తో : "ఈ యిద్దరు పిల్లలనీ చూడండి. నిన్న రాత్రి రోడ్డుమీద నిద్దర పోయారు వీళ్ళిద్దరూ."

"అవును. వాళ్ళకి ఒకయిల్లు వుంది. ఉన్నప్పటికీ వాళ్లు రోడ్డుమీదకివచ్చి నిద్రపోయారు," అన్నాడు ఫ్లానగన్.

"ఇల్లు వుండి ఏమి లాభం ? తండ్రి ఎప్పుడూ తప్పతాగి యింటికి వస్తాడు. తల్లి వీళ్ళని అదుపులో పెట్టలేదు. నిజానికి వీళ్లుచెడ్డవాళ్ళు కాదు. కాని, చూసేవాళ్ళు లేక చెడిపోయారు. వీళ్ళని రిఫారమ్ స్కూలుకి పంపించెయ్యనా అని ఆలోచిస్తు న్నాను..."

ఫాదరీ మొహంలోని చిరునవ్వు గమనించి జడ్జీ ఆగాడు. "పోనీ వీళ్ళని మీ అదుపు ఆజ్ఞలలో వుంచుకుంటారా కొన్నాళ్ళపాటు ?"

ఫాదరీ తటపటాయించాడు. ఈ పిల్లలని ఎక్కడ వుంచడం ? ఒకడు పన్నెండేళ్ళవాడు; మరొకడు పధ్నాలుగేళ్ళ

వాడు. తను నడుపుతున్న హోటల్లో వాళ్ళని ఉంచడం మంచిపనికాదు. రోజూ ఒకసారి తను వాళ్ళని కలుసుకుంటా ననీ, అందువల్ల వాళ్ళలో మార్పు రావచ్చునేమో చూదా మనీ అన్నాడు ఫ్లానగన్.

ఫాదరీ, ఆ పిల్లలూ కలుసుకుండేవారు. వాళ్ళు బళ్ళో ఏమి చదువుతున్నదీ, ఏయే ఆటలు ఆడుతున్నదీ, వార్తాపత్రికలు అమ్మి రోజూ వాళ్ళు ఎంత సంపాదిస్తున్నదీ- ఈ సంగతులన్నీ ఫాదరీకి యిష్టాగోష్ఠిగా చెప్పేవారు ఆ పిల్లలు.

"మీ రిద్దరూ చాలామంచి పిల్లలు-వృద్ధిలోకివస్తారు," అనేవాడు ఫాదరీ.

ఒకరోజు ఫ్లానగన్ అడిగాడు ఆ కుర్రాళ్ళని: దేవు డంటే ఏమిటో తెలుసా?- అని. వాళ్ళ నాన్నా అమ్మా ఎప్పుడూ చర్చికి వెళ్లరనీ, దేవుడనేవాడు ఆకాశంలోకూచుని మనని శపించిపోస్తూ వుంటాడనీ అన్నారు ఆ పిల్లలు.

"దేవుడు శిక్షిస్తాడు- చెడ్డపిల్లలని శిక్షిస్తాడు," అన్నాడు పన్నెండేళ్ళ కుర్రవాడు, దేవుడి మాట తలుచుకు భయపడుతూ.

"దేవుడంటే భయపడకూడదు. మనందరినీ ప్రేమించే తండ్రి ఆయన. చెడ్డపిల్లలు ఎందుకు చెడ్డవారు అయ్యారో ఆయ నకి అర్థమవుతుంది. మనందరమూ దేవుడిని ప్రేమించాలి," అన్నాడు ఫాదరీ.

కుర్రాళ్ళిద్దరూ ఆనాటినుంచీ సండేస్కూలుకి వెళ్తూండే వారు. తండ్రి ఎప్పటిమల్లేనే తప్పతాగి యింటికి వస్తూండే

వాడు ; అనారోగ్యురాలైన తల్లి ఎప్పటిమల్లేనే వారి ఆలనా పాలనా చూసేదికాదు. కాని, పిల్లలు బాగుపడ్డారు. అర్ధ రాత్రివేళ వీధులమ్మట తిరగక, గదిలో కూచుని, తమ పాఠాలు చదువుకునేవారు.

ఈ పిల్లలిద్దరూ ఫాదర్ ఫ్లానగన్ బోధనవల్ల పూర్తిగా మారిపోవడం జడ్జీలకికూడా సంతోషహేతువు అయింది.

పెరోల్ మీద ఫాదరీకి వొప్పజెప్పబడేవారి సంఖ్య నానాటికి పెరగజొచ్చింది. వీరందరినీ సాయంత్రపువేళ సందు చివరని కలుసుకోడానికే వీలయేది ఫాదరీకి. ఈ పిల్లలని హోటల్లో వుంచడమూ పడదు ; మరొకచోట ఉంచేందుకూ స్థలంలేదు. ప్రతిదినమో, రెండురోజుల కొకసారో సందు చివర కలుసుకున్నప్పటికీ ఫాదరీ పరిచయంద్వారా ఈ పిల్లలలో గొప్ప మార్పు కనపడేది. ఫాదర్ ఫ్లానగన్ దగ్గిర మాజిక్ వుందనుకునేవారు.

* * *

న్యాయశాఖకి చెందిన కొందరు పెద్దలు, ఫాదర్ ఫ్లానగ్గన్ దగ్గిర వున్నది ప్రేమానురాగాలనే మాజిక్ అని వొప్పుకోలేక పోయేవారు. ఫాదరీ తన దగ్గరికి వచ్చిన పిల్లలని అనునయవాక్యాలతో మార్చేవాడు. వారిని సాత్వికులుగా చేసేవాడు.

చాలామంది పిల్లలు పెద్దనేరాలు చేసినవాళ్ళు కాదు; వాళ్ళు చేసినవి చిన్నచిన్న తప్పులే. అది తప్పుదారి అని

న్యాయశాఖ వాళ్లని శిక్షించేది. ఫాదరీ ఒక్కడే వారిపాలిట రక్షకుడిలా జన్మించాడు.

ఒమహాలో ఒకప్పుడు అనేక నేరాలు జరుగుతున్నాయి. దొంగతనం, యిళ్లదోపిడీ, దారిని పోయేవారిని అకారణంగా హింసించడం—పట్టణాన్నంతా ఒక దొంగలముఠా గడగడలాడిస్తూంది. ఈ దొంగల ముఠాలో ఏ ఒక్కడికీ యిరవై ఏళ్ళు లేవని ఊళ్ళో పుకారు. పోలీసు సిబ్బంది దొంగల నాయకులని ఎట్టకేలకు అరెస్టు చేశారు.

నాయకులు ఏడుగురు. ఈ ఏడుగురినీ న్యాయస్థానానికి తీసుకువచ్చే వేళకి, ఫాదర్ ఫ్లానగన్ అక్కడే ఉన్నాడు. ప్రజాభిప్రాయం ఈ కుర్రాళ్ళ విషయంలో ఎలా ఉందో ఫాదరీకి తెలుసు. వీరు కనికరించకూడదని చెడ్డవాళ్లనీ, ఈ పిల్లలని జెయిల్లో పడేస్తేగాని తమ పిల్లలు బాగుపడరనీ పట్టణంలోని ప్రజలు అనుకుంటున్నారు.

ఏడుగురినీ బోనులో వరసగా నుంచోపెట్టారు. ఏ ఒక్కడికీ పట్టున పదిహేనేళ్ళు లేవు. వారి లేత మొహాలు చూసి ఫాదరీ ఆశ్చర్యపోయాడు. పత్రికలు వీరిని మహా ఘోరంగా వర్ణిస్తున్నాయి; ఈ గజ దొంగలకి బుద్ధిచెబితేగాని సంఘానికి విమోచనం లేదంటున్నాయి. బోనులో నుంచున్న పిల్లలు గజదొంగల్లా లేరు; బెదిరిన మేకపోతుల్లా ఉన్నారు. భయంతో గడగడలాడుతున్నారు వాళ్లు.

వారు చేసిన నేరాలు వరసని కోర్టువారు చదివారు. దొంగతనాలూ, హింసలూ, ఇతర ఘోరాలూ—ఒకటేమిటి,

తమమీద ఆరోపింపబడ్డ నేరాలన్నీ తాము చేశామని వాళ్ళు ఒప్పుకున్నారు. వాళ్ళ మొహాలలో కనిపించిన భయోత్పాతమే ఫాదర్ ఫ్లానగన్‌కి ఆశ కలుగచేసింది. వాళ్ళింకా పిల్లలు, బాగుపడతారేమో అనుకున్నాడు.

న్యాయాధికారి తీర్పు చెప్పడానికి సిద్ధంగా ఉన్నాడు. ఫాదర్ ఫ్లానగన్ ఛటాలున నుంచుని జడ్జిగారితో యిల్లా అన్నాడు: "ఆ పిల్లలని నా సంరక్షణలో ఉంచండి."

న్యాయస్థానంలో వున్నవారంతా తెలతెల్లపోయారు. పిల్లలకి శిక్షపడితేగాని ప్రజలకి తృప్తిగా ఉండదు. జడ్జీకి ప్రజాభిప్రాయమూ తెలుసు; ఫాదరీ సమర్థతా తెలుసు. ఇలాంటి దుర్మార్గుల్ని ఫాదరీ బాగుచెయ్యగలడా అయినా చూదాం–అనుకున్నాడు జడ్జీ.

"ఈ పిల్లల రికార్డు మీకు తెలుసా?"

"తెలియడమే కాదు, ప్రతి పేరా పరిశీలనగా చదివాను. వీరు బతుకుతున్న పరిసరాలు సక్రమమయినవి కావు; వీరిని కనిపెట్టి చూసే పెద్దవాళ్ళు లేరు. భయం భక్తీ లేకపోవడం వల్ల యిలా తయారయారు," అన్నాడు ఫాదర్ ఫ్లానగన్.

"ఆల్ రైట్. మీకు ఒప్పచెబుతాను పిల్లలని–ప్రయత్నించి చూడండి," అని ఫ్లానగన్‌తో అని, పిల్లలవైపు తిరిగాడు జడ్జీ. "అబ్బాయిలూ, మీకు మరొక అవకాశం లభిస్తూంది. ఫాదర్ ఫ్లానగన్ మిమ్మల్నొక దారిలోకి తీసుకురాగలనంటున్నాడు. ఆయన అక్కరపడకపోతే, మీకీపాటికి

జైలుశిక్ష పడి వుండేది. అంచేత, మీరు ఆయన చెప్పినట్టు నడుచుకొని బాగుపడండి."

ప్రజలమాట ఎటువున్నా, అందరికంటె ఎక్కువ ఆశ్చర్య పడింది నేరంచేసిన పిల్లలు. ఒకరి మొహాలవంక ఒకరు చూసుకున్నారు; ఫాదరీవంక బెరుకుబెరుకుగా చూశారు. జైలు కటకటాలు తప్పవనుకున్న తమని రక్షించిన ఈ ఫాదరీ ఎవరు?

వారు ఆశ్చర్యపడటం ఫాదరీకి తెలుసు. కాని, అది గమ నించనట్టుగా వారిదగ్గిరికి వచ్చి "పదండి" అన్నాడు. కిక్కురు మనకుండా అతనివెంట నడిచారు. న్యాయస్థానంలో ప్రజలు ఆ దృశ్యాన్ని ఆశ్చర్యసంభ్రమాలతో చూశారు.

## 15

కోర్టు ఆవరణనుంచి బయటికివస్తూ జేబులో చెయ్యి దూర్చి చాక్‌లెట్ల పొట్లం ఒకటి బయటికి తీశాడు ఫ్లానగన్. మాటా మంతీ లేకుండా చాక్‌లెట్లు కుర్రవాళ్ళకి పంచాడు. కుయ్‌కయ్ మనకుండా కుర్రవాళ్ళు ఆ చాక్‌లెట్లని నోట్లో వేసుకున్నారు. కాస్త ధైర్యంవచ్చి వాళ్లు మాటలు మొదలు పెట్టారు.

"నేను జడ్జీ అంటే భయపడ్డానా?" అని దబా యించాడు ఒకడు.

"భయమా—ఆ కోతి మొహాలని చూసి?" అన్నాడు మరొకడు.

"అబ్బాయిలూ కోతిమొహాలగురించిన కబుర్లు కట్టి పెట్టండి. అవి మర్చిపోవలసిన విషయాలు," అన్నాడు ఫ్లానగన్.

"మేము ఎలా మర్చిపోగలం. ఈ పోలీసులు మమ్మల్ని వొదులుతారు గనకనా!" అన్నాడు ఒక కుర్రవాడు.

"మీరు యివ్వాళనుంచీ నా సంరక్షణలో ఉంటున్నారు. మీకూ, పోలీసులకీ ఏమీ సంబంధం లేదు. మీరు ఆలోచించుకోవలసినది మీ గురించి."

కొంతసేపు నడిచాక ఒక కుర్రవాడు అడిగాడు: "ఫాదర్, మమ్మల్ని ఏం చేస్తారు మీరు ?"

"మనందరం కలిసి బేస్ బాల్ ఆడదామా ?"

"బేస్ బాలా ? బేస్ బాల్ ఆడటం శిక్ష ఎలా అవుతుంది ?"

"మీకు శిక్ష విధించాలని ఎక్కడ ఉంది ?"

ఇంకా కొంత దూరం నడిచాక, యిక్కడ కూర్చుందామా? అని అడిగాడు ఫాదర్. అందరూ చతికిలపడ్డారు. ఫాదర్ తన పాఠం మొదలుపెట్టబోతున్నాడని కుర్రవాళ్ళు అనుకున్నారు. తప్పు చెయ్యడం, పాపం చెయ్యడం మొదలైన వాటి గురించి చెప్పబోతున్నాడని అనుకున్నారు. ఫాదర్ ఫ్లానగన్ అలాటి సంగతులేమీ ప్రస్తావించలేదు; బేస్ బాల్ గురించే మాట్లాడాడు. బేస్ బాల్ గురించి తమకెంత తెలుసో, ఫాదర్‌కి కూడా అంత తెలిసివుండటం వారికి సంతోషమయింది.

"ఈ స్థలం చాలా విశాలంగా ఉంది. మనం బేస్ బాల్ కోర్టు యిక్కడ పెట్టుకోవచ్చు. ఈ స్థలం ఎవరిదో ఆ ఆసామీ నాకు తెలుసు. ఆయనతో మాట్లాడి బేస్ బాల్ కోర్టు ఏర్పాటు చేస్తాను," అన్నాడు ఫ్లానగన్.

తాము శిక్షార్హులైన నేరస్థులనేవిషయం మర్చి పోయారు ఆ పిల్లలు. ఫ్లానగన్ వారికి ఆప్తబంధువులా కనిపిం చాడు. బేస్ బాల్ కోర్టు ఎప్పుడు ప్రారంభిద్దామంటే ఎప్పుడు ప్రారంభిద్దాం అని అమితాసక్తి చూపడం మొదలెట్టారు.

ఫ్లానగన్ కి వీళ్ళొక్కరే కాదుగా! చర్చికి సంబంధించిన దైనందిన విధులు కొన్ని వున్నాయి. బాధ్యతాయుతమైన హోటల్ నిర్వహణ ఒకటి ఉంది. పెరోల్ లో వొదిలిపెట్ట బడిన యితర పిల్లలు వున్నారు. వారిని వారానికి ఒకసారైనా కలుసుకుంటూ వుండాలి. ఈ కార్యక్రమం అంతకీ తోడు ఏడుగురు కొత్త పిల్లలు.

"మీరు మీ మీ యిళ్ళకి పోండి. వారానికి మూడు సార్లు మనం ఈ ప్రదేశంలో కలుసుకుంటూ వుందాం," అన్నాడు ఫాదర్ ఫ్లానగన్.

"వేసవి వస్తోంది. సాయంత్రం వేళ చాలాసేపు వెల్తురు ఉంటుంది. అలాటప్పుడు ఎంత సేపయినా బేస్ బాల్ ఆడుకో వచ్చు. ఆటలద్వారానే ఈ పిల్లల మనసు మార్చగలగాలి," అనుకున్నాడు ఫ్లానగన్ తనలో తను. మనుష్యప్రయత్నం తర్వాత, దేవుడు వున్నాడు!

బేస్ బాల్ ఆటకి కావలసిన పరికరాలు సమకూర్చాడు ఫ్లానగన్. ఈ ఏడుగురేగాక చుట్టుప్రక్కల పిల్లలుకూడా ఆట చూడటానికని వచ్చి, ఆటల్లో పాల్గొనేవారు. రౌడీ పిల్లలు ఏడుగురూ ఒక జట్టూ; మిగతా పిల్లలు ఒక జట్టూ. ఆట అయిపోయాక, తన శిక్షణలో వున్న పిల్లలతో కష్టసుఖాలు

మాట్లాడేవాడు. ఇతని పరిచయంతో వాళ్ళందరూ దేవతలు అయిపోయారని అనడం అతిశయోక్తి గాని, ప్రతి ఒక్కరూ తన వయసుకి తగ్గపని ఏదో ఒకటిచేస్తూ, సద్వర్తన అలవరుచుకున్నారని వొప్పుకోక తప్పదు. కోర్టుమొహం వారు మళ్ళీ చూడలేదు.

ఈమాదిరిగా చాలామంది పిల్లలు స్టానగన్ సంరక్షణలోకి వచ్చి బాగుపడేవారు. అతనికి ఒక్కటే యిబ్బందిగా ఉండేది. ఇలా వచ్చిన పిల్లలని పెంచేందుకు వసతిగృహం లేకపోవడం. "ఏ కుర్రవాడూ మనం మార్చలేనంత చెడ్డవాడై ఉండడు" అన్న అతని నమ్మకం పదేపదే రుజువవుతూండేది. ప్రేమ, భక్తి-ఈ రెండూ కుర్రవాని హృదయంలో కలిగించడంతో, కుర్రవాడు పూర్తిగా మారిపోయేవాడు.

అర్ధరాత్రి దాటింది. పర్కింగ్ మెన్స్ హోటల్‌లో (అతను నిర్వహిస్తున్న హోటల్ పేరు) తను ఒక్కడూ కూచుని ఏవేవో పెద్ద ఆలోచనలు చేస్తున్నాడు. చిన్న పిల్లలకి ఆశ్రయం కలిగించడమనేది ఆషామాషీగా చేయవలసిన వ్యవహారం కాదు. జీవితమంతా అందుకోసమై ధారపోయడానికి సిద్ధంగా ఉండాలి. ఆ పని తనే చేస్తే...?

తను ఈ పర్కింగ్ మెన్స్ హోటల మూసెయ్యవలసి వుంటుంది. ఉద్యోగాలు లేనివారికి ఉద్యోగాలు యిప్పించే సంస్థలు అనేకం ఉన్నాయి. తన జీవితకార్యమేదో ముందు కనిపిస్తోంది. హోటల్‌నయినా యివ్వాళటికివ్వాళ మూసెయ్యనక్కరలేదు. ఈ చలికాలం వెళ్ళాక, దాని సంగతి చూడవచ్చు. తన హోటల్‌ని నమ్ముకొని అనేకమంది యిక్కడికి

రావచ్చు-ఈ చలికాలంలో. వసంతకాలంనాటికి తన నూతన సంస్థ ప్రారంభం కావచ్చు. ఇదంతా ఒక్కడి చేతిమీద నడ పడం సాధ్యమా ?-అని తనను తాను ప్రశ్నించుకున్నాడు.

మత గురువుగా తనకొచ్చే స్వల్ప ఆదాయంతోటే, యిప్పటికీ కాలం గడుపుతున్నాడు. తనకి సిరిసంపదలేమీ లేవు. తనకి కావలసిన డబ్బు ఎక్కడనుంచి వస్తుందో అంత కంటె తెలియదు. ఫ్లానగన్‌కి వున్నదల్లా విశ్వాసబలం. భగ వంతుడు ఎక్కడో ఒకచోటనుంచి తెప్పించి యిస్తాడు. అది ఆయనకే వొదిలెయ్యడం ధర్మం.

ఆ రాత్రి ఫాదర్ ఫ్లానగన్ తన జీవితానికి సంబం ధించిన ఒక మహత్తర నిశ్చయం చేసుకున్నాడు. ఆ వెలుగు వుంతద్వారా ముందుకి పోవడమేగాని వెనక్కి రావడమంటూ లేదు. అనాధబాలురకి ఒక ఆశ్రయం ఏర్పాటు చెయ్యాలని ఫ్లానగన్ నిశ్చయించుకున్నాడు.

## 16

ఫ్లానగన్ తన మనసులో వున్న ప్లానులు ఆర్చిబిషప్‌కి ప్పేటప్పటికి, బిషప్ ఆదరభావంతో చిరునవ్వు నవ్వాడు. మహాలో అందరికీ తెలుసు ఫాదర్ ఫ్లానగన్ మంచితనం నరించీ, నెమ్మది గురించీ. అలాటప్పుడు ఆర్చిబిషప్‌కి, తన దగ్గిర పనిచేసే మతగురువు ఫ్లానగన్ గురించి ఏమీ తెలియ కుండా వుంటుందా? అంతా తెలుసు!

"నాయనా నువ్వు చేస్తున్నది మంచిపనే! ఆర్థికంగా మామీద ఆధారపడవద్దు," అన్నాడు ఆర్చిబిషప్.

అసలు, అనుమతి దొరికినందుకే ఫ్లానగన్ ఆనందపర వశుడయ్యాడు. బిషప్ ధనసహాయం చెయ్యాలని అతను ఎంత మాత్రం అనుకోలేదు. తనమీద ఆపాటి నమ్మకం పై అధికారికి వుంటే చాలుననుకున్నాడు.

ఇంక కావలసినది డబ్బు.

ముందువున్న కష్టపరంపరలు తెలిసినప్పటికీ అతను నిరుత్సాహపడలేదు. ఇల్లూ వాకిలీ లేని ముసలివాళ్లకి ఒక హోమ్–అంటే ప్రజలకి అర్థమవుతుంది. అల్లరి చిల్లరగా తిరిగే కుర్రవాళ్ల కోసమని ఒక హోమ్ అంటే ప్రజలకేం సానుభూతి ఉంటుంది? రిఫారమ్ స్కూలూ, అనాథాశ్రమలూ లేవా?— అంటారు.

మునుపటికంటే అనుభవం సంపాదించివుండటంచేత ఫ్లానగన్‌కి తనకి రానున్న యిబ్బందులు తెలుసు. తను ఒక్కడూ స్వసుఖాలు త్యాగం చెయ్యటంతో సరిపడదు— ప్రజలుకూడా ఈ సమస్యని సానభూతిగా పరిశీలించగలగాలి. ఫ్లానగన్ ఈ ప్రస్తావన ముందుగా తమ యింట్లో ఎత్తాడు. భోజనాలవేళ దభీమని ఈ వార్త చెప్పేటప్పటికి, ఎవరికేమనాలో తెలియలేదు. తల్లి "అదేమిటబ్బాయ్!" అంది.

ఫ్లానగన్ చిరునవ్వు నవ్వి అన్నాడు: "చెడిపోయే పిల్లలని బాగుచేసినవాణ్ణి అవుతాను. ఆర్చి బిషప్ నన్ను ఆశీర్వదించారు."

"నంటూ పెట్టూ మాటలేకి? పిల్లలేం చెయ్యగలరు?" అని అడిగింది తల్లి.

"వీలయితే నువ్వూ, నెల్లీ సాయంచేదురుగాని! కొందరు సిస్టర్ల సహాయం నాకు లభించగలదని ఆర్చిబిషప్ అన్నారు. వీటికేం—భగవంతుని కృప వుంటే?"

అన్నగారైన పాట్రిక్‌కి ఫ్లానగన్ మనసు అవగాహన అయింది. ఇక అడ్డుచెప్పడం అనవసరమనుకుని, మిగతా వారిని ఫ్లానగన్ కృషివైపు ప్రోత్సహించాడు.

* * *

కాని, ఒమహానగర ప్రజలకు ఫ్లానగన్ చేస్తున్న పని బాగా లేదు. "ఇల్లూ వాకిలీ లేని పిల్లలనీ, దుర్మార్గులైన పిల్లలనీ అదుపులో పెట్టేందుకు ప్రభుత్వ సిబ్బంది ఉంది; పోలీసుశాఖా, న్యాయస్థానం వున్నాయి. ఫాదరీ పని భగవత్సందేశాన్ని విశ్వవ్యాప్త చెయ్యడం; పిల్లల సంగతి ప్రభుత్వం చూసుకుంటుంది" అన్నా డొకాయన.

"భగవత్సందేశం దౌర్భాగ్యులైన పిల్లలకి అక్కర్లేదా? ఆ సందేశంవల్ల వారి జీవితపు విలువలు మారుతాయేమో!" అనేవాడు ఫ్లానగన్.

"పిల్లల ఈ సమస్య పరిష్కరించేందుకు యితర ంస్థలు వున్నాయి."

"పిల్లవాణ్ణి వాటికి వొప్పజెప్పడంతో మన బాధ్యత రిపోయినట్టేనా!"

"ఎక్కడయినా పొరబాటు వుంటే, ప్రజావాక్యం ానిని సరిదిద్దుతుంది" అన్నాడొక విమర్శకుడు.

"మంచి పిల్లలు వృద్ధిలోకి వస్తున్నారు. కుళ్లిపోయిన ్లలాటివారు ఈ చెడ్డ పిల్లలు, న్యాయస్థానం వాళ్ళ

విషయమై వాకబుచేస్తుంది. మరి మనం పన్నులు ఎందుకు కడుతున్నట్టు!'' అని నిలవదీసి అడిగాడు ఒకాయన.

వీరంతా రాతిగుండెల వారని అనుకోనక్కరలేదు. దారిద్ర్యమంటే వారు వూహించలేరు; రిఫారమ్ స్కూల్స్ ఎలా వుంటాయో వారు ఏనాడూ చూడలేదు. అందుకనే ఆ మొండిపట్టు.

మరి కొందరున్నారు. వారు ఫాదర్ ఫ్లానగన్ పూనుకున్న ప్రతి ప్రయత్నానికీ తగు సహాయం చేసేవారు. కాథలిక్‌లు, ప్రొటెస్టెంటులు,యూదులు—అను భేదం ఉండేది కాదు సహాయం చేయడంలో.

ఫాదర్ ఫ్లానగన్‌కి 25 వ నెంబరు వీథిలో రెండంతస్తుల మేడ ఒకటి అద్దెకి దొరికింది. వెనకటి మేడకి మల్లే యిది కూడా కాస్త పాతబడ్డ యిల్లే! గదులన్నీ బాగా దుమ్ముపట్టి వున్నాయి. పిల్లలు ఆడుకునేందుకు స్థలం ఉంది. ప్రార్థన గది కూడా ఒకటి ఉంది.

మొదటి నెల అద్దె తొంభయిడాలర్లూ ముందు అడ్వాన్సుగా యివ్వాలి.

అడ్వాన్సు తక్షణం కట్టేందుకు ఫాదరీ జేబులో ఒక్క డాలరు కూడా లేదు—తొంభయి సెంట్లు వున్నాయేమో!

''ఇవ్వాళ రేపట్లో కట్టవచ్చుగా ?'' అని అడిగాడు ఫాదరీ యింటి యజమానిని.

మర్నాడు ఫ్లానగన్, ఆ తొంభయిడాలర్లూ ఒక స్నేహితునివద్ద అప్పుచేసి, మొదటి నెల అడ్వాన్సు కట్టాడు.

# 17

ప్రారంభంలో అయిదుగురే కుర్రాళ్లు ఉన్నారు. వెనకటి క్రయిమ్ వేవ్ లోని వాళ్ళెవరూ కాదు వాళ్లు, దిక్కూ మొక్కూ లేని పిల్లలు ముగ్గురూ, 1917 డిసెంబరు 12 వ తేదీన ఫాదర్ ఫ్లానగన్ కి జువినైల్ కోర్టువారు ఒప్పజెప్పిన పిల్లలు మరి యిద్దరూ.

కోర్టువారు ఒప్పజెప్పిన పిల్ల లిద్దరినీ ఉదయం వేళ తీసుకొచ్చాడు. దిక్కూ మొక్కూ లేక తన సంరక్షణలో వుంచబడ్డ పిల్లలు ముగ్గురినీ మధ్యాహ్నం వేళ తీసుకొచ్చాడు. ఈ అయిదుగురి తోటీ హోమ్ ప్రారంభమయింది. హోమ్ నడిపించేందుకు ఆర్చిబిషప్ యిద్దరు సిస్టర్స్ నీ, మరొక స్త్రీనీ పంపాడు.

పిల్లలకంటికి ఈ యిల్లు ఎంతో సరదుగా కనిపించింది వంట సామానూ, భోజనం బల్లా, కుర్చీలూ, టేబుల్సూ ఒకదానికొకటి పొందిక లేకుండా వున్నప్పటికీ పిల్లలకిమాత్రం యిదంతా కొత్తకొత్తగా ఆకర్షణీయంగా ఉంది. మేడ రెండవ అంతస్తులో రకరకాల మంచాలూ, పరుపులూ, దుప్పట్లూ చిందర వందరగా పడి వున్నాయి. మొదటి అంతస్థులో ఒక ప్రార్థనా మందిరం ఉంది.

బాలరాజ్యం ఆవిధంగా తలొకరూ ధర్మంచేసిన వస్తువులతో ప్రారంభమయింది. మొదటి అయిదుగురు పిల్లలలోనూ పెద్దవాళ్ళు ముగ్గురూ, చిన్నవాళ్ళిద్దరినీ దబాయించడం ప్రారంభించారు. రెండు మూడుగంటలు యిల్లంతా పరీక్షించి

వచ్చినమీదట, కిటికీదగ్గిర మంచం తనకి కావాలంటే తనకి కావాలని వాదులాట ఆరంభించారు. సిస్టర్స్ కల్పించుకుని పూరుకోబెట్టేదాకా పూరుకోలేదు.

భోజనాల వేళ ఫాదర్ ఫ్లానగన్‌ని ప్రశ్నలతో విసిగించారు. ఇంకా పిల్లలు వస్తున్నారా? తమని బడికి పంపడం కూడా ఉంటుందా? ఆడుకునేందుకు స్థలం వుందా లేదా? ఆటపాటలకి స్థలం లేకపోతే ఎలా!

ఫాదర్ ఫ్లానగన్ వున్నదున్నట్టు చెప్పాడు: "ముందు ఏమయేదీ చెప్పలేను. బడికి వెళ్ళవలసి వుంటుంది. ఆడుకునేందుకు వెనకతట్టున స్థలం ఉంది. రోడ్డుమీదికి వెళ్ళి ఆటలు ఆడకూడదు."

ఈ అయిదుగురిలోనూ నేరస్థులెవరూ లేరు. స్వగృహాలు లేకపోవడమే వారి దురదృష్టం. పొద్దుట జువినైల్ కోర్టువారు వొప్పజెప్పిన యిద్దరూ అన్నదమ్ములు. అందులో ఒక అబ్బాయి రెండవ ప్రపంచ యుద్ధం వేళప్పుడు పసిఫిక్ రంగంనుంచి ఫాదర్ ఫ్లానగన్‌కి యిలా రాశాడు: "1917 డిసెంబరు 12వ తేదీనాటి ఉదయం నా హృదయంలో ముద్ర వేసుకుంది. ఆ శుభోదయం నా జీవమాత్రుడు మర్చిపోగలడా? నన్నూ మా అన్నయ్యనీ కోర్టువారు మీ సంరక్షణకి వొప్పజెప్పినప్పుడు, ఆ ఉదయం మీరు మాకు యిచ్చిన చాక్లెట్ల రుచి యిప్పటికీ నా నాలుకమీద ఉంది... ఆ కొత్త యింటికి మనం వెళ్ళడం, మీరు సిస్టర్‌ని పిలిచి మాకు పరిచయం చెయ్యడం. ఆమె మాకు మేము వుండవలసిన చోటు చూపించడం, ఆరోజు మీరు భోజనం చెయ్యకుండా తొందర తొందర

రగా ఏదో పనిమీద వెళ్లిపోవడం,...ఆ శుభోదయం తలచు కున్నప్పుడల్లా ఏవో ఆనందబాష్పాలు వస్తాయి."

చిన్నపిల్లలతో మాట్లాడుతున్నప్పుడు కూడా ఫాదర్ ఫ్లానగన్ వారికొక వ్యక్తిత్వం యిచ్చి మాటాడేవాడు. "మనం చాలాపనులు చెయ్యవలసి ఉంది. మనం చాలా విష యాలు నేర్చుకోవలసి వుంది. మనకి మనంగా ఒకస్కూలు ఏర్పాటుచేసుకోగలగాలి. మనందరికీ కావలసినన్ని బట్టలు సంపాదించుకోవాలి" అలా సాయలా పాయలాగా చెప్పే వాడు వారితో.

ఫాదర్ ఫ్లానగన్ ఆ రోజుల్లో చాలామందికి తెలివి హీనుడుగా కనిపించి వుండవచ్చు. అతను ఏ రోజు కారోజు జేబు తడుముకోవలసి వచ్చేది. బయటనుంచి వచ్చేది అతి స్వల్పంగా ఉండేవి. రోజురోజుకీ పిల్లలసంఖ్య పెరిగేదిగాని, బయటనుంచి ధనం దానికి తగినట్టు పెరిగేది కాదు. న్యాయాధి కారులు ఫాదర్ ఫ్లానగన్ కృషిని ప్రశంసించేవారు. కాని అతనికి ధనసహాయం చేయగలమార్గం వారిచేతుల్లో వుండేది కాదు.

ఇంకో సంగతి: నిరాశ్రయులైన వారికి హోటల్ నడపడం వేరు; పిల్లలకి హోమ్ నడపడం వేరు. ఫ్లానగన్ యిప్పుడు హోటల్ యజమాని కాదు; దిక్కులేని పిల్లలకి తల్లీతండ్రీను-కుటుంబ యజమాని.

ఒకరోజు రాత్రి ఒకకుర్రాడు కెవ్వున ఏడుస్తూ లేచాడు. ఫ్లానగన్ గబగబా ఆ కుర్రవాని దగ్గిరికి వెళ్ళి, ఎందుకేడు

స్తున్నాడో అడిగాడు. మంచానికి మధ్యగా కూచుని ఏడుస్తు న్నాడు ఆ అబ్బాయి—చెవి పోటట. ఫాదరీకి దారితోచ లేదు. డాక్టరుని పిలుచుకురావాలా? ఏం చెయ్యాలి?

ఇంకొక కుర్రవాడు అన్నాడు: "నాకు చెవిపోటు వచ్చి నప్పుడల్లా, మా అమ్మ నన్ను ఎత్తుకు తిప్పుతూ, జోలపాట పాడేది."

నైట్ గవున్‌లో వున్న ఫాదరీ కుర్రవాణ్ణి చేతుల్లోకి తీసుకుని భుజంమీద పడుకోపెట్టుకుని, గదిలో యిటూ అటూ పచార్లుచేస్తూ, తను చిన్నప్పుడు ఐర్లండ్‌లో పాడే జోలపాట ఒకటి నెమ్మదిగా పాడనారంభించాడు. పది నిముషాల్లో కుర్ర వాడు నిద్రపోయేటప్పటికి, ఫ్లానగన్ తన కంఠధ్వని తలుచు కొని ఆశ్చర్యపోయాడు.

*　　　　*　　　　*

అయిదుగురు పిల్లలూ పెద్ద వాళ్ళకి సాయపడదామను కునేవారు. కాని వాళ్ళు సాయం చెయ్యకుండా వుంటేనే మేలు అనిపించేది. గాజు ప్లేట్లన్నీ ఒకే చేతిలో పుచ్చుకుందామనుకునే వాడు ఒకకుర్రాడు; గాజు గ్లాసులు పెద్దవాళ్ళు పుచ్చుకున్నట్లు పుచ్చుకుందామనుకునేవాడు మరొక కుర్రాడు. ఏమయితేనేం పిల్లలు సాయం చెయ్యకుండా, దూరంగా వుంటేనే పనులు సక్రమంగా తెమిలేవి.

ఒకవారం గడిచి, దారిలో పడుతూండే వేళకి మెంబర్ల సంఖ్య పదిహేను అయింది. ఇంట్లో ఎన్ని మంచాలున్నాయో అంతమంది పిల్లలూ ఉన్నారు.

ఆర్చిబిషప్ ఫాదర్ ఫ్లానగన్ కృషిని అభినందిస్తూ, అతను మిగతా ఫాదరీలకిమల్లే మామూలు డ్యూటీస్ చేయ వలసిన పని లేదనీ, ఈ హోమ్ చూచుకుంటే చాలుననీ అన్నాడు. ఫ్లానగన్‌కి చాలా సంతోషమయింది.

ఎటువంక చూసినా నిరాధారులైన పిల్లలే. జువినైల్ కోర్టునుంచిపిల్లలు ప్రతిదినమూ వస్తూనే వున్నారు. హోమ్ ప్రారంభించి రెండువారలయిందో లేదో, పిల్లలసంఖ్య ఇరవై అయిదు అయింది.

*　　　　*　　　　*

కులమత భేదాలూ, రంగు విచక్షణా లేదు ఈ హోమ్‌లో. రంగునిబట్టీ, మతాన్నిబట్టీ వేరువేరుగా ఉంచడ మనేది ఆదినుంచి లేదు బాలనగర్‌లో. దైవచింతన కుర్ర వానిలో కలిగించడ మొక్కటే ఫ్లానగన్‌కి కావలసింది. ఆ కుర్రవాడు దైవప్రార్థన ఏ పద్ధతిలో చేస్తాడనేది అనవసర మతనికి. ఇది నిధారులగృహం—మతప్రచారసంస్థకాదు.

ఫ్లానగన్‌కి సదభిప్రాయాలు ఏలాటివైనప్పటికీ, కుర్ర వాళ్లని మార్చడమనేది ఒక రోజులో జరిగే పనికాదు.

మొదటివారం బాగానే ఉంది. రెండో వారంలో పిల్లలసంఖ్య పెరగడంతో కాస్త కిక్కిరిసినట్టయింది. పిల్లల చేత అరుపులూ, కేకలూ మాన్పించడంకూడా కొద్దిగా కష్ట తరమైన పని.

అర్ధరాత్రివేళ రెండవ అంతస్తునుంచి పెద్దకేక వినిపించి చేది. ఫ్లానగన్, సిస్టర్సూ, యింట్లోనున్న యావన్మందీ నిద్దర

నుంచి లేచేవారు. తీరా రెండవ అంతస్తుకివెళ్ళిచూస్తే యిద్దరు కుర్రాళ్ళు కొట్టుకుంటూ వుండటమో, లేక ఎవరో ఒక అబ్బాయి కలలో భయపడి, కెవ్వున అరవడమో అయి వుం ది.

తెల్లారగట్టే లేచి, ఒక కుర్రవాడు పెద్దగా కేకలు మొదలెట్టేవాడు. మరొకడు దుప్పటీ చించి కిటికీకి ముడివేసే వాడు. ఒకసారి ఒక అబ్బాయి కిటికీలోంచి మేడదిగబోయి, సగంవరకూ దిగి, భయమేసి, పెద్దపెట్టున ఏడుపు మొదలెట్టాడు. ఫ్లానగన్ వాణ్ణి ఒక దోవలోకి తీసుకు వచ్చేవేళకి, సావిట్లోవున్న పిల్లలు ఒకరితో ఒకరు యుద్ధం ప్రకటించి, అక్కడున్న కుర్చీ విరగగొట్టారు. వాళ్ళని సరిదిద్దేవేళకి డోర్ బెల్ గణగణ మోగ నారంభించింది-జువినైల్ కోర్టు నుంచి మరొక యిద్దరు పిల్లలు!

ప్రారంభంలో ఎన్నో గడ్డుసమస్యలు ఎదురయేవి ఫ్లానగన్ కి. ఒక పక్క సంస్థకి కావలసిన సహాయ సంపత్తులు చూసుకోవాలి ; మరొకపక్క ఈ అల్లరి పిల్లలు యింటిని పాడు చెయ్యకుండా చూసుకోవాలి. ఉక్కిరి బిక్కిరయిపోయే వాడు ఫ్లానగన్.

"జిమ్మీ నా చొక్కా చించాడు."

"అందరూ నన్ను కొడుతున్నారు."

"పెనం దొడ్లోకి ఎత్తుకుపోయి దానితో బాజాలాట ఆడుతున్నారు పిల్లలు!" అని సిస్టర్.

ఒకొక్కప్పుడు ఫ్లానగన్ కి మతిపోయేది. ఫాదర్ పాట్రిక్ యింటికి వెళ్ళి కాసేపు కూచుని, అక్కడ అన్న

దమ్ములతోటీ, అక్కచెల్లెళ్ళతోటీ, తలిదండ్రులతోటీ నవ్వుతూ కబుర్లు చెప్పేవాడు.

"మా పిల్లలు అద్భుతమైన వాళ్ళు. అన్నీ ఒకదారిలో పడ్డాక చూదురుగాని, మా వాళ్లు ఎంత మంచివాళ్లో. ఒక్కొక్కప్పుడు చికాకుగా ఉంటుంది. అయినా..."

తల్లి కుమారుని వంకచూసి నవ్వుతూ, "పిల్లలు అల్లరి చెయ్యక, పెద్దవాళ్ళు అల్లరి చేస్తారటరా?" అనేది.

అల్లరి అంటే యిదా? ఇలాటి అల్లరి తను ఎక్కడా వినలేదు. టేబుల్ క్లాత్ లు కత్తెరతో చించడం, పనిగట్టుకు నీటి కుళాయి వొదిలిరావడం, యిల్లంతా నీరు చిమ్మడం— యిలాటి పనులలో ఫ్లానగన్ పిల్లలు ఆరితేరినవారు.

"ఫాదర్ ఫాదర్" అని గట్టిగా అరుపులు వినిపించాయి.

ఫాదర్ వెళ్లాడు కుర్రాళ్ళ దగ్గిరికి. అందరిలోకీ లావుగా వుండే అబ్బాయి డానీ కనిపించడం లేదనీ, తప్పిపోయాడనీ అన్నారు.

ఎలా మాయమయ్యాడు డానీ? డానీని యిక్కడికి ఎందుకు పంపారంటే, అతను యింట్లోనుంచి తరుచూ పారిపోతూండేవాడు. తల్లి రోగిష్టిది; తండ్రి ఈ కుర్రవాడిని చావమోదుతూండేవాడు. అందుకని ఎప్పటికప్పుడు యింట్లోనుంచి పారిపోతూండేవాడు. ఇక్కడి ఈ హోమ్‌కి వచ్చాక డానీ కాస్త బాగుపడ్డాడు.

ఇంటిల్లిపాదీ డానీని వెతకడం మొదట్టారు. పైభాగం, కిందభాగం, మెట్లకిందా, అన్నిగదులూ, దొడ్డివాకిలీ, యిల్లు

సమస్తం గాలించారు. డానీ కనపడలేదు. రెండవ అంతస్తు లోని స్నానాలగది పక్కగా నడుస్తున్నప్పుడు, ఫ్లానగన్‌కి ఏదో శబ్దం వినిపించినట్టయింది. చటుక్కున వెనక్కి వచ్చి స్నానాలగది తలుపు లోనికితోశాడు.

నేలమీాద చతికిలబడి పకపకా నవ్వుతున్నాడు డానీ. ఏమిచెయ్యడం ఆ కుర్రాణ్ణి? కొద్దిగా మందలించమని సిస్టర్‌ని వప్పగించి, తను ఆఫీసు రూమ్‌లోకి వెళ్ళిపోయాడు ఫ్లానగన్.

*　　　　*　　　　*

క్రిస్‌మస్ రెండురోజులు వుంది. హోమ్‌లో ఆహార పదార్థాలు లేవు. పండుగనాడు పిల్లలకి ఏంచేసి పెట్టడమా అని ఆలోచిస్తూ వుండగా, ఒక ధర్మాత్మురాలు ఒక పెద్ద బుట్టెడు కాబేజీ, రెండు బుట్టల ఆహార పదార్థాలూ పంపింది. ఇరవై అయిదుగురు పిల్లలకీ కాబేజీతో కమ్మటి డిన్నర్ పెట్టారు క్రిస్‌మస్‌నాడు. పిల్లలు ఎంతో హితవుగా తిన్నారు.

## 18

పై నెల అద్దె ఎక్కణ్నుంచి తీసుకొచ్చి యివ్వడం? అనే సమస్య ఫ్లానగన్‌కి వుండనేవుంది. ఈ సంగతి యిటు వుండగా ఫాదర్ ఫ్లానగన్ గురించి వాద ప్రతివాదాలు చెల రేగుతున్నాయి. దమ్మిడీకి కొరగాని ఈ మతగురువు, హోమ్ అంటూ ఒకటి ప్రారంభించి చేస్తున్న మహాకార్యం ఏమిటి? అని విమర్శకులు విరుచుకుపడ్డారు. పిల్లలకి క్రిస్‌మస్ నాడు కూడా, కడుపునిండా మాంసంతో భోజనం పెట్టలేని ఈ పెద్ద మనిషి, యిలాటి పనులకి ఎందుకు పూనుకోవాలని ఆడిపోసు కోవడం మొదలెట్టారు.

మయింది. అయినప్పటికీ పని మనుషులని పెట్టకుండా సిస్టర్సూ, తనూ చూసుకుంటూండేవారు కార్యకలాపమంతా. అప్పు డప్పుడు సిస్టర్ నెల్లీ, ఫ్లానగన్ తల్లి నోరా వచ్చి సాయం చేస్తూండేవారు.

గృహకృత్యమంటే చూసుకోవచ్చు కాని పిల్లలని బళ్ళో వెయ్యడమనేది సమస్య అయింది. యిల్లూ వాకిలీ లేని, పిల్లలుగనక వాళ్ళ చదువు వక్రగతిని ఉండేది. తనకి తానుగా స్కూలు ప్రారంభించడమనేది యిప్పట్లో సాధ్యంకాదు ఫ్లానగన్‌కి. అందుకని ఒమహాలోని పాఠశాలాధికారులకి తన పిల్లల పరిస్థితి విన్నవించాడు ఫ్లానగన్.

"మా పిల్లలు స్వతహాగా చెడ్డవాళ్ళు కాదు. చూసే వాళ్ళు లేక, వాళ్ళు అలా అయిపోయారు. వాళ్లని మేము బాగు చేస్తున్నాం. మీరు బళ్లో చేర్చుకు చూడండి," అని సవినయంగా చెప్పుకున్నాడు ఫ్లానగన్.

పాఠశాలాధికారులకి ఈ దుండగీడు పిల్లలని చేర్చు కోవడం యిష్టంలేదు. కాని ఫాదరీ అంత ఘట్టిగా వారి తరఫున చెబుతూండటంవల్ల ప్రయత్నించి చూదామనుకున్నారు కొందరు.

పిల్లలని బడికి తీసుకు వెళ్లేందుకూ, బడినుంచి తీసుకు వచ్చేందుకూ ఒక గుర్రపు బగ్గీ అద్దెకి మాట్లాడాడు ఫ్లానగన్.

బళ్లో చేర్పించినంతమాత్రాన పని అయిపోతుందా? ఇందులో కొందరు పిల్లలు స్కూలు రూల్సు అతిక్రమించి నడిచేవారు. అప్పుడుకూడా ఫ్లానగన్ హోమ్‌వారు పిల్లలని

కొట్టేవారు కాదు. "బెత్తంతో చురుకు తగిలించడం గానీ, వీపుమీద కొట్టడంగానీ చెయ్యకూడదు ; భయపెట్టి వారిని విధేయవర్తనులుగా చెయ్యడంవల్ల ఉత్తమ శీలం అలవడదు ; అలా కొట్టడం పెద్దవాళ్ల ఓటమికి తార్కాణం," అనేవాడు ఫ్లానగన్.

అల్లరిచేసే పిల్లలని శిక్షించేందుకు ఒకటే మార్గం. వారికి వున్న "అవకాశాలు" వూడబెరికి, ఒక గంటసేపు ఆటలకి వెళ్లవద్దంటేసరి. అందరు పిల్లలూ ఆడుకుంటున్నప్పుడు వంటయింట్లో సాయం చెయ్యమనడం, లేదా అందరి కంటె మరొక గంటసేపు ఎక్కువ చదవమనడం ; ఇతర పిల్లలకి బిస్కట్లు పెడుతున్నప్పుడు ఆ అబ్బాయికి పెట్టననడం ; శని ఆదివారాలలో బయటికి తీసుకు వెళ్లకపోవడం—ఈ మాదిరిగా వారికివున్న అవకాశాలు వూడలాక్కుంటే, వారంతటవారు చెప్పినమాట వింటారు.

శీతాకాలం వచ్చేటప్పటికి ఫ్లానగన్ హోమ్ వాడు దుడుకులు లేకుండా ఒకదారిలో పడింది. ఒక రైతు సంచీ నిండా బంగళాదుంపలు పంపేవాడు ; ఒక పెద్దింటావిడ బిస్కట్ డబ్బాలు పంపేది ; ఒకళ్లు పాతబట్టలూ, మరొకళ్ళు పాతసామానూ- యిలా ఎవరికి తోచిన ధర్మం వారు చేస్తూండేవారు.

ఇల్లు పరిశుభ్రంగా ఉంచడం, తమ గదులలోని వస్తు ఎక్కడి వక్కడ జాగ్రత్త పెట్టడం పిల్లలు నేర్చుకోసాగారు. గృహకృత్యం చూడటంకూడా పిల్లల నిత్యవిధులలో ఒకటి అయింది. తన పక్క తను వేసుకోనడం, తన పుస్తకాలు తను

సర్దుకోనడమే కాకుండా యితర పనులలో కూడా ప్రతి పిం వాడూ ఎంతో యింతో సాయపడేవాడు.

శీతాకాలం గడిచేటప్పటికి ఈ హోమ్ గురించి పది మందీ చెప్పకోనడం మొదలెట్టారు. ముఖ్యంగా స్త్రీలు ఎంతో మెచ్చుకునేవారు ఫ్లానగన్ కృషిని.

మెప్పుతోబాటు వైరివర్గం కూడా పెరిగింది. "రిఫారమ్ స్కూళ్ళే సరి అయినవి; దెబ్బకి దెయ్యం పారి పోతుంది; ఫ్లానగన్ ఏవో వెర్రిమొర్రి ప్రయత్నాలు చేస్తు న్నాడు," అనేవారు.

తనకి వ్యతిరేకులైన వారనేకమంది వద్దనుంచి ఫ్లానగన్ సహాయ మపేక్షించవలసి వచ్చేది. "ప్రేమ, అనురా గం అంటూ పిచ్చి మాటలతో, చెడ్డపిల్లలకి శిక్షణ నేర్ప బోవడం శుద్ధ తెలివితక్కువ. శిక్షార్హులైనవారిని రిఫారమ్ స్కూల్సుకి పంపించడం ఉత్తమం," అనేవారు ఫ్లానగన్ విరోధులు.

ఆ పిల్లలు దోషులు కారనీ, వారికి భయంనుంచి విముక్తి కలగాలనీ, దండించడానికిబదులు ప్రేమిస్తే వారు బాగుపడతారనీ అనేవాడు ఫ్లానగన్. "చాలా మంది పిల్లలకి న్యాయమార్గాన బతకాలనే ఉంటుంది. తాము చేసిన పని బాగుందని యితరులు మెచ్చుకోవా లనిపిస్తుంది. ఏ మార్గం అవలంబిస్తే పెద్దవాళ్లు మెచ్చుకుంటారో తెలియక, ఒక్కొక్క ప్పుడు తప్పుదారి పడతారు. కాని, వారి అంతర్యంలో పెద్దల మెప్పు సంపాదించాలనే ఉంటుంది," అని పిల్లల తరఫున వాదించేవాడు ఫ్లానగన్.

కొందరికి అతనిమాటలు బాగుండేవి. కాని, చాలామంది అతని సిద్ధాంతాలు ఆమోదించేవారుకాదు. ప్రస్తుతం అతను నడుపుతున్న హోమ్ చిన్నది. పెద్ద పెద్ద వాళ్ళ మన్ననలు పొందగలిగేటంత విశాలసంస్థకాదు. కుర్రవాళ్లలోని చెడ్డ తనానికి ఎవరూ బాధ్యులుకారనీ, కుర్రవాళ్ళే బాధ్యులనీ అనుకొనడం ప్రాణానికి హాయిగా ఉంటుంది. అందుకనే చాలా మంది పెద్దవాళ్ళు నెపం కుర్రవాళ్లమీద వేసి, తృప్తిపడేవారు.

*　　　*　　　*

1918 వసంతకాలంనాటికి ఫ్లానగన్ హోమ్ ఆర్థికంగా ఒడ్డుకి చేరుకుంది. డబ్బుసంబంధమైన వొడుదుడుకులు తగ్గాయి. కొందరు సహృదయులు ప్రతినెలా విరాళాలు పంపుతూండే వారు. పిల్లల తలిదండ్రులు కాస్త వున్నవాళ్లయితే, వారు కూడా తృణమో పణమో సమర్పిస్తూండేవారు. పిల్లవాళ్లని చేర్చుకునేందుకు డబ్బు కట్టడమనేది ఏనాడూ లేదు. కాని, చేర్చుకున్నాక తలిదండ్రులు కాకపోతే, దగ్గిర బంధువులయినా ఏదో కొంత ముట్టజెపుతూండేవారు సంస్థకి. ఆటస్థలం, పిల్లలు ఆడుకునేందుకు బంతులూ, బాట్లూ, చిన్నపార్కూ, మ్యూజిక్ డిపార్ట్మెంటు మొదలైనవన్నీ సమకూరాయి.

నానాటికి స్థలాభావం సమస్య అయిపోయింది. ఇప్పుడు వున్న యిల్లు చాలటంలేదు. ఇంత కంటె పెద్ద యిల్లు, మరీ ఎక్కువ అద్దె లేకుండా కావాలి.

ఫ్లానగన్ మిత్రుడొకతను, పట్నానికి అవతలవైపుగా కట్టిన యిల్లు చాలా చవకగా అద్దెకి యిస్తానన్నాడు. ఫ్లాన గన్ వెళ్ళి ఆ భవనం చూసివచ్చాడు. సువిశాలంగా ఉంది.

ఇప్పుడు వున్న యింటికి పదిరెట్లు పెద్దది. చూడటానికి కూడా దర్జాగా ఉంది. రెండతస్తుల పెద్ద మేడ. ఇల్లంతా పరిశీలించిన మీదట ఫాదరీ అన్నాడు: "ఇలాటి యిల్లే నాకు కావాలి."

తక్షణం అప్పటికప్పుడు వ్యవహారం ఫైసలు చేసి, యిల్లు పుచ్చుకున్నాడు ఫ్లానగన్.

## 19

జూన్ నెలలో కొత్త యింట్లోకి మారారు.

ఈమధ్య స్థలంచాలని కారణంగా, కొందరు పిల్లలని చేర్చుకోనడం పడలేదు. కొత్త యింట్లోకి మారాక, మొదటి వారంలో ముప్ఫయిమంది పిల్లలు చేరారు. మొత్తం సంఖ్య నూరుకి మించింది.

హోమ్ పెరగడంతో సమస్యలూ పెరిగాయి. వంద మంది కుర్రవాళ్లని అదుపులో వుంచడమంటే మాటలు కాదు. తప్పనిసరిగా స్టాఫ్‌ని వేసుకోవలసి వచ్చింది. సమస్యలు పెరుగుతున్నప్పటికీ నిరుత్సాహమనేది ఎవరికీ లేదు.

పక్కవాని జేబు కత్తిరించిన కుర్రవాడొకడూ, ఆరు సార్లు జెయిలుకు వెళ్ళి వచ్చిన కుర్రవాడు మరొకడూ—యిలా రకరకాల మంది. ఆచరణయోగ్యం కావనుకున్న సిద్ధాంతాలద్వారా వీరిలో పరివర్తన తీసుకువస్తున్నాడు ఫ్లానగన్. భవిష్యత్తు ఏమి కానుందో అతనికే తెలియదు. కాని ఆశలుమాత్రం చిగురిస్తున్నాయి.

పిల్లలకి బోలెడంత ఆట స్థలం. ఫుట్‌బాలూ, బేస్ బాలూ మాత్రమేగాకుండా ఎన్నో రకాలైన ఆటలలో

పాల్గొనేవారు పిల్లలు. వారిలో వారికి పోటీ పందాలు.
బ్లూస్ అనీ, వైట్స్ అనీ రెండుజట్లుగా ఆటలు ఆడేవారు.
తమ హోమ్‌కి ఒక బాండువాద్యం వుండాలంటూ, ఆవేసంగు
లలో బాండు వాయించడం నేర్చుకున్నారు కొందరు పిల్లలు.
ఒమహానగరంలోని ఉత్తమవాద్యగాళ్ళు ఫ్లానగన్ హోమ్
పిల్లలకి బాండువాయిద్యం నేర్పారు.

ఫ్లానగన్ పిల్లలు బాండు వాయించుకుంటూ ప్రజల
మధ్యకి వెళ్ళేటప్పటికి చాలామంది విమర్శకుల నోళ్ళు కట్టుబడి
పోయాయి. లేత వయసుగల ఆ పిల్లలు అద్భుతంగా
బాండువాయిస్తూంటే ప్రజలు ఆనందబాష్పాలు రాల్చేవారు.

ఒక రోజు వుదయం ట్రక్కునడుపుకుంటూ ఒక రైతు
వచ్చి "ఫాదరీఎక్కడ?" అని అడిగాడు. ఫాదరీ యింకా
రాక పూర్వమే ట్రక్కులోనుంచి ఒక ఆవుని దింపాడు.

"మీరు డబ్బేమీ యివ్వక్కర్లేదు. మీకూ, మీ
పిల్లలకీ అని తీసుకొచ్చాను ఈ గోవుని. దొడ్లో కట్టేయ
మనండి," అన్నడా రైతు ఫాదరీతో.

ఆవుని దొడ్లో కట్టేశారు. మొట్టమొదట ఎవరు
పాలుపితకడమా అని పిల్లలు కీచులాడుకోవడం మొదలెట్టారు.
"ఒకరి తర్వాత ఒకరు- వంతుల ప్రకారం," అని పిల్లలని
సమాధానపరిచాడు ఫాదరీ. చాలామంది పిల్లలకి పొలం పని
అంటే మహాసంతోషమని గ్రహించాడు ఫ్లానగన్. బాల
రాజ్యంలో ఒక వ్యవసాయ పాఠశాల నెలకొల్పడానికి అది
నాందీవాక్యం.

దొడ్డి వాకిలిలో ఒకమూలగా స్థలం బాగుచేయించి, కేటలాగు విత్తనాలు తెప్పించి కాయగూరలు వేశారు. రోజూ నీళ్లుపొయ్యడం, కాస్త మొక్కయినా కనిపిస్తుందేమో నని వెయ్యికళ్ళు పెట్టుకుచూడటం—అంతవరకే జరిగింది. కాయగూరల మాట ఎలా వున్నా, ఆఖరికి చిన్న మొక్క కూడా మొలవలేదు. పిల్లలకీ, ఫ్లానగన్‌కీ, అందరికీ విచార మేసింది. పై ఏడాది మళ్ళీ ప్రయత్నించి చూదామనుకున్నారు.

కూరలతోటకు మల్లేనే కోళ్ల పెంపకం కూడా ప్రారంభించారు. ఇది తోటలాగ మోసం చెయ్యలేదు.

వందమంది పిల్లలకి తిండీ బట్టా యిచ్చి పోషించడం మాటలా? ఫ్లానగన్ సతమతమవుతుండేవాడు. భగవంతుణ్ణి ప్రార్థించడం, ప్రజలని అర్థించడం—యివే అతనికి తెలుసు. ఫాదర్ ఫ్లానగన్ కృషికి తాముకూడా యితోధిక సాయం చేయాలనే సంకల్పంతో ఆ చుట్టుపట్లనున్న యువతీ యువకులలో కొందరు ఫ్లానగన్ హోమ్‌కి ఉచితంగా పనులు చేసిపెడుతూండేవారు. ఉత్తర ప్రత్యుత్తరాలూ, అకవుంట్లూ—యిలాంటి నిత్యవ్యవహారాలన్నీ తమ తీరిక సమయాలలో వచ్చి చూసి పెడుతూండేవారు ఆ యువతీ యువకులు.

ఇది యిలా వుండగా, ఫాదర్ ఫ్లానగన్ పాట్రిక్ నార్టన్ అను బంధువు నొకణ్ణి తనకి అసిస్టెంటుగా తీసుకున్నాడు. నార్టన్ ఫ్లానగన్‌కి మేనల్లుడవుతాడు. అతను ఫ్లానగన్‌కి అనుచరుడవడమేకాకుండా ఆత్మీయుడయాడు. బాలరాజ్య నిర్మాణానికి యిద్దరూ మూలవిరాట్టులు. కాలక్రమేణా నార్టన్

బాలరాజ్యం మేనేజిమెంటు చూసుకుంటూ వచ్చాడు. ఫ్లాన గన్ మరణ సమయాన అతని పక్కనే వున్నాడు నార్టన్.

నార్టన్ ఫ్లానగన్ హోమ్‌లో చేరడంతో ఫ్లానగన్ కి ఉత్తర ప్రత్యుత్తరాల బాధ తీరిపోయింది. అదంతా నార్టన్ చూసుకునేవాడు. ఇరుగు పొరుగున వుండే గృహిణులు విశ్రాంతివేళల యిక్కడికి వచ్చి, ఫ్లానగన్ హోమ్‌కి తమకి తోచిన సాయం తాము చేసేవారు. మదర్స్‌గిల్డ్ అను ఒక సంఘం ఏర్పాటయింది అనాథబాలుర సేవ నిమిత్తం. ఈ మదర్స్‌గిల్డ్ సహాయంవల్ల ఫ్లానగన్ బరువు కొంతవరకూ తగ్గింది.

తమ కథ లోకానికి చెప్పడం ఎంత అవసరమో ఫ్లానగన్ తెలుసుకున్నాడు. తన దగ్గిర చేరిన వాళ్ళంతా సంఘ బహిష్కృతులైన పిల్లలు. వారు ఈనాడు అందరు పిల్లలకి మల్లే బతుకుతూ, ఉత్తమ పౌరులుగా రూపొందు తున్నారు. పిల్లలని ఏవగించుకోకూడదన్న గుణపాఠం ప్రజలకి తెలియజెప్పాలి. అందుకోసమని 'బాయెస్ హోమ్ జర్నల్' అను పత్రిక ఒకటి ప్రారంభించాడు ఫ్లానగన్. అందులో వ్యాసాలు తనూ, తన హోమ్‌లోని పిల్లలూ రాసేవారు.

అదేదో గొప్ప జర్నల్‌గా పేర్కొనవలసిన పనిలేదు. కాని, అందులో వారి హోమ్‌కి సంబంధించిన వార్తలూ, విరాళాలు పంపిన దాతలపేర్లూ వగైరా ఉండేవి. ఈనాడు ఆ జర్నల్ లేదు. దానిస్థానే 'బాయెస్ టవున్ టైమ్స్' అనుపత్రిక వారి స్వంత పవర్ ప్రెస్సులో అచ్చయి వెలువడుతూంది.

సబ్బులు చెయ్యడ మొకటి మొదలెట్టారు వారు ఆ రోజుల్లో. దొడ్లో చిన్న రేకుల పెద్దు వేసి, అందులో సబ్బులు తయారు చేస్తూండేవారు. సబ్బు బిళ్ళకిపైన పుల్లిపార కాగితం చుట్టి, యింటి యింటికీ వెళ్ళి అమ్ముతూండేవారు. ఎంత శ్రమ పడి అమ్మినా లాభం కనిపించేది కాదు. అంచేత, ఫ్లానగన్ సబ్బులు అమ్మకాన్ని చెయ్యవద్దన్నాడు; హోమ్‌కి కావల సినవి మాత్రమే వారు తయారు చేసుకునేవారు.

బాయెస్ హోమ్ జర్నల్‌లో దాతలపట్టి ఈవిధంగా ఉండేది:

రెండు బొంతలు...మిసెస్ యక్స్‌వద్దనుంచి.

ఒక కోడిపెట్ట...హెన్రీవద్ద నుంచి.

కలకండ, బత్తాయిలు...ఆర్ దంపతుల వద్దనుంచి.

మూడు దుప్పట్లు...మిస్టర్ రిచర్డ్...

నాలుగుకోట్లు...మిసెస్ యాగ్నిస్...

రెండు టేబుల్ క్లాత్ లు...యమ్. జె...

ఒక జోళ్ళ కంపెనీ బూట్లు యిచ్చేది; ఒక ఎలక్ట్రికల్ షాపు బల్బులు యిచ్చేది...జర్నల్‌లో రెండు కాలమ్స్ ఈ పట్టియే ఉండేది.

ఒక మధ్యాహ్నం మదర్ సిగ్గీలోని సభ్యురాలు ఒకామె ఒక పెట్టెనిండా డిస్నర్ డిషెస్ పుచ్చుకు వచ్చింది.

"ఎందుకివి ?" అని ఫాదర్ ఫ్లానగన్ అడిగాడు.

ఇన్నాళ్ళ బట్టి పగిలిన పళ్ళాలలో తింటున్న ఫాదరీకి, భోజనం చేసేందుకు శుభ్రమైన పళ్ళేమూ, కాఫీ తాగేందుకు పగలని కప్పూ వుండటం కనీసావసరం అందావిడ.

రోజులూ నెలలూ గడుస్తున్నాయి. ఆహార పదార్థాలూ, బట్టలూ, డబ్బూ ఏదో తమాషాగా అనుకోనిచోటి నుంచి వస్తున్నాయి. ఫాదర్ ఫ్లానగన్‌కి తెలుసు: తననీ, వందమంది పిల్లలనీ, అందరినీ భగవంతుడనేవాడు కనిపెడుతూ వుంటాడని. ఆయనమీద భారం వుంచి, ప్రార్థించడమే మానవులు చేయగల పని.

* * *

ఇతర రాష్ట్రాలనుంచీ, దూరపు పట్నాలనుంచీ బాలురు రాసాగారు. కాని, ఒమహాలో కొందరికి ఈ హోమ్ యిష్టం లేదు. జాతి మత భేదాలూ, అంతస్తులూ పాటించకుండా ఫ్లానగన్ పిల్లలని చేర్చుకోవడం కొందరికి కిట్టేదికాదు. అందరినీ కలిపి వుంచడం మంచిపని కాదనీ, తెల్లవాళ్ళూ, చైనావాళ్ళూ, నీగ్రోవాళ్ళూ వేరువేరుగాగాక ఒకేచోట వుండటం భావ్యం కాదనీ విమర్శించేవారు. మరికొందరు ఫ్లానగన్ హోమ్‌ని "దొంగలబడి" అనేవారు.

"అందరూ ఒకే మాదిరిగా ఉండటం భగవంతుని అభిప్రాయమైతే ఈ రంగు భేదాలు ఎందుకు సృష్టించాడు?" అని నిలవేసేవాడు ఒక ఒమహా రాజకీయవేత్త!

"అది సరేగాని, మానవాత్మ ఏ రంగులో ఉంటుందో చెప్పగలవా?" అనేవాడు ఫ్లానగన్. తెలుపని కొందరూ, నలుపని కొందరూ-ఎవరి నోటికొచ్చినట్టు వారు వాగేవారు.

ఆ తర్వాత, ఫ్లానగన్‌కి ఈ పిల్లల చదువు ఒక సమస్య అయి కూచుంది. వెనక చిన్నయింట్లో వుంటున్నప్పుడు వారిని స్కూల్సుకి పంపుతూండేవాడు. రానురాను, ఫ్లానగన్ హోమ్ కుర్రవాడంటే మిగతాపిల్లలు నానాఅల్లరీ చేసేవారు. ఫ్లానగన్ హోమ్ పిల్లలు కాడీలని నామకరణం చేసి, అకారణంగా ఈ పిల్లలని హింసిస్తూ వుండేవారు.

ఇది పని కాదనుకొని, ఫ్లానగన్ నార్టన్ సాయంతో, తమ పిల్లలకని వేరే స్కూలు ప్రారంభించాడు. ప్రతి కుర్రవాని విషయంలోనూ తగిన శ్రద్ధ తీసుకొని విద్య నేర్పుతూండేవారు. అంతటితో ఫ్లానగన్ పిల్లల చదువు విషయమై బాధ తీరిపోయింది.

## 20

1919 నాటికి బాలరాజ్యం అన్ని విధాలా ఒక దారిలో పడింది. దాతలవద్ద నుంచి ఎప్పటికి మల్లే విరాళాలు వస్తున్నాయి. ప్రభుత్వ విద్యాశాఖ ఈ హోమ్ పాఠశాల విద్య మిగతాచోట్ల నేర్పే విద్యకి తీసిపోదని వొప్పుకుంది.

1918 లో ఫాదర్ ఫ్లానగన్ అమెరికన్ సిటిజన్ అయ్యాడు. 1920 లో ఈ హోమ్‌ని వ్యాపార నిబంధనల ప్రకారం ఇన్‌కార్పరేట్ చేశారు. ఒమహా బిషప్ ఈ సంస్థకి ఎక్స్ అఫీషియో ప్రెసిడెంటు.

ఇందు విషయమై పెద్ద పబ్లిసిటీ ఏమీ జరగలేదుగాని, లాయర్లూ, జడ్జీలూ, డాక్టర్లూ సోషల్ వర్కర్సూ ఈహోమ్ గురించే మాట్లాడుతూండేవారు. బాలరాజ్యని మొదట్లో వచ్చిన విజిటర్లు అధికారరీత్యా వచ్చినవారు. తరవాత్తర

వాత వివిధ వ్యాపకాలకి చెందిన మనుషులు ఈ వింత చూడ టానికని వచ్చేవారు. ఒక ఫాదరీ చెడ్డపిల్లలని మంచిపిల్లలుగా ఎలా మారుస్తున్నాడో కళ్ళారా చూదామని వచ్చేవారు. ఉన్నతాధికారాలు, ఇతర దేశాలకి చెందిన ప్రముఖులు, ఘనతవహించిన వ్యాపారస్థులు, ఆఖరికి సినీమా స్టార్స్‌కూడా వస్తూండేవారు ఈ బాలరాజ్యం చూడటానికి.

1921 సెప్టెంబరునాటికి మొత్తం 1251 మంది పిల్లలకి ఆశ్రయమిచ్చింది ఈ బాలరాజ్యం. ఇందులో చాలాభాగం ఒమహాకి చెందినవారు. తక్కినవారు మిగతా రాష్ట్రాలనుంచి వచ్చినవారు. కొందరు కొన్ని నెలలు వున్నమీదట, తలిదండ్రుల దగ్గిరికి పంపబడుతూండేవారు. మరికొందరిని కొన్ని కుటుంబాలు పెంచుకునేవి. ఏమయినా, ఫాదర్ ఫ్లానగన్ అవతలవారి విషయమై తృప్తి పడినమీదటగాని పిల్లలని వొప్పజెప్పేవాడు కాదు.

రోజులు గడుస్తున్నకొద్దీ యింకా స్థలం కావలసి వచ్చేది. వెనకవైపు మరికొంత స్థలం వుంటే బాగుండునని పించింది. చిక్కుడూ మొదలైన పాదులు పెట్టుకోవచ్చు. తమకి కావలసిన కాయగూరలు తామే పండించుకోవచ్చు; గొడ్డూ గోదనీ కట్టేసుకోవచ్చు.

ప్రస్తుతం వున్న స్థలం చాలదన్నారు స్నేహితులు. తన ఆప్తవర్గపు సహాయంతోనే ఒమహాకి ఉత్తరదిశగా వున్న ఫ్లారెన్స్‌లో సెవెన్ హాల్స్ ఫారమ్ అనుప్రదేశాన్ని కొన్నాడు ఫ్లానగన్.

వ్యవసాయకృషి తిరిగీ ప్రారంభించారు. ప్రతివారం
ల్లలు యిక్కడికి వచ్చి ఆ కృషిలో పాల్గొనేవారు. అయినా
ానగన్ కి సంతుష్టికాలేదు. అతను అనుకున్నట్టు పనులయేవి
ేదు. అందుకని, అది అమ్మేసి, ఫార్టీ ఏకర్స్ అను స్థలాన్ని
చుట్టుపక్కలే కొన్నాడు. ఇక్కడపంటా అదీ బాగుండేది-
ల మంచిది.

ఇది యిలా వుండగా, అటుపక్క హోమ్ పెరిగిపో
చ్చింది. ప్రస్తుతం వున్నచోట పిల్లలు కిక్కిరిసి వుంటు
్నారు. ఇంతకంటె పెద్దయిల్లు కావాలని వుంది ఫాదరీకి. మళ్ళీ
ే యిల్లు ఎందుకు, ఫార్టీ ఏకర్స్‌లోనే భవన నిర్మాణం
ి స్తేనో!—అనికూడా వుంది మనసులో. "దొంగలబడి"
యన్నై ప్రజాభిప్రాయమెలాంటిదో ఫ్లానగన్‌కి తెలియనే
ను.

పట్టణానికి మధ్యని ఒకపెద్ద యిల్లు వుంది ఖాళీగా. దాని
ం ప్రయత్నించాడు ఫ్లానగన్. కాని, చుట్టుపట్ల వారు
ాటి పోరుగు తమపిల్లల పురోభివృద్ధికి భంగకరమని ఫ్లాన
ికి యిల్లు యివ్వనీయకుండా చేశారు.

పత్రికల వారిని పిలిచి ఫ్లానగన్ చెప్పాడు: "రెండు
ాలక్రితం, అర్ధరాత్రివేళ, తూము కాలువపక్కగా పడి
్న పదేళ్ళ కుర్రవాణ్ణి నా సంరక్షణకి వొప్పజెప్పారు.
్బాయి తండ్రి, తల్లిని హత్యచేసి, ఆ హత్యా నేరానికి
ు జయిల్లోపడి వున్నాడు. ఈ పదేళ్ల కుర్రవాణ్ణి నేను
హోమ్‌లో చేర్చుకోవడమా, మానడమా? నేను
్కో లేదనుకోండి. చలితో గడ్డకట్టుకుపోయినఆ అబ్బాయి

వ్యవసాయకృషి తిరిగి ప్రారంభించారు. ప్రతివారం పిల్లలు యిక్కడికి వచ్చి ఆ కృషిలో పాల్గొనేవారు. అయినా ఫ్లానగన్‌కి సంతృప్తి కాలేదు. అతను అనుకున్నట్టు పనులయేవి కాదు. అందుకని, అది అమ్మేసి, ఫోర్టీ ఏకర్స్ అను స్థలాన్ని ఆ చుట్టుపక్కలే కొన్నాడు. ఇక్కడ పంటా అదీ బాగుండేది- నేల మంచిది.

ఇది యిలా వుండగా, అటుపక్క హోమ్ పెరిగిపో యొచ్చింది. ప్రస్తుతం వున్నచోట పిల్లలు కిక్కిరిసి వుంటున్నారు. ఇంతకంటె పెద్దయిల్లు కావాలని వుంది ఫాదరీకి. మళ్ళీ అద్దె యిల్లు ఎందుకు. ఫోర్టీ ఏకర్స్‌లోనే భవన నిర్మాణం సాగిస్తేనో!—అనికూడా వుంది మనసులో. "దొంగలబడి" విషయమై ప్రజాభిప్రాయమెలాటిదో ఫ్లానగన్‌కి తెలియనే తెలుసు.

పట్టణానికి సమీపాన ఒక పెద్ద యిల్లు వుంది ఖాళీగా. దాని కోసం ప్రయత్నించాడు ఫ్లానగన్. కాని, చుట్టుపట్ల వారు అలాటి పొరుగు తమ పిల్లల పురోభివృద్ధికి భంగకరమని ఫ్లానగన్‌కి యిల్లు యివ్వనీయకుండా చేశారు.

పత్రికల వారిని పిలిచి ఫ్లానగన్ చెప్పాడు: "రెండు వారాలక్రితం, అర్థరాత్రి వేళ, తూము కాలువపక్కగా పడి వున్న పదేళ్ళ కుర్రవాణ్ణి నా సంరక్షణకి వొప్పజెప్పారు. ఆ అబ్బాయి తండ్రి, తల్లిని హత్యచేసి, ఆ హత్యా నేరానికి గాను జయిల్లో పడి వున్నాడు. ఈ పదేళ్ళ కుర్రవాణ్ణి నేను మా హోమ్‌లో చేర్చుకోవడమా, మానడమా? నేను చేర్చుకో లేదనుకోండి. చలిలో గడ్డకట్టుకుపోయిన ఆ అబ్బాయి

శవం కనిపించి వుండేది మర్నాటి పొద్దుట– అంతేగా! మా అబ్బాయిలు చెడ్డవాళ్ళుకారు. వారిని యితరులు అపార్థం చేసుకుంటారు. మిగతా అందరి పిల్లల్లాటి వారే మా పిల్లలు కూడాను.''

తను నడుపుతున్న హోమ్‌లాటిది ఎంత ఆవశ్యకమయినదో పత్రికలవారికి విడమరిచి చెప్పాడు ఫ్లానగన్. అంతటితో అతని పని ఏమయింది ?– ఏమీ అవలేదు. ఇంకో సంగతి కూడా ఆలోచించాడు. ఇరుగు పొరుగు వాళ్ళకి యిష్టం లేనప్పుడు, తమ పిల్లలని అక్కడ వుంచడం తమకే నష్టం. అందుకని ఆ ప్రయత్నం విరమించి, దూరంగా ఏదయినా స్థలం దొరుకుతుందేమో చూడసాగాడు.

*　　　　*　　　　*

తొంభయి నాలుగు ఎకరాలుగల ఓవర్‌లుక్ ఫారమ్ అమ్మకానికి సిద్ధంగా వుందని యిళ్ళ ఏజంటు జోసఫ్ చెప్పాడు. ఫ్లానగన్ అంటే చాలా గౌరవం జోసఫ్‌కి.

స్థలం చూపించిన తర్వాత ఫాదరీతో అన్నాడు: ''ఇది చాలా ఖరీదు చేస్తుంది. మీరు భరించలేరనుకుంటాను.''

ఫారమ్‌లో పెద్ద యిల్లొకటీ, చిన్న చిన్న యిళ్ళు మరికొన్నీ ఉన్నాయి. అక్కడవున్న ఫార్టీ ఏకర్స్ అమ్మేసి, మొత్తంమీద యిది కొనుక్కుంటే, పిల్లలు వుండేందుకూ, వ్యవసాయకృషికీ అన్నిటికీ పనికొస్తుందనుకున్నాడు ఫ్లానగన్. అతని దగ్గిర రెండు మూడు వేల డాలర్ల రొఖ్ఖం ఉంది; బిల్డింగ్ ఫండు పేర కొంత నిలవచేశారు. ఇవన్నీ ముందు ఇచ్చేసి,

మిగతాది వాయిదాల ప్రకారం యివ్వవచ్చు ననుకున్నాడు ఫాదరీ.

జోసఫ్ వ్యవహారం తెలిసిన మనిషి. ఫ్లానగన్ ఫ్హోమ్ ఆస్తి అంతా కలిపినా ఈ అమ్మకం పైకంలో నూటికి అయిదోవంతు ఉంటుందో వుండదో !

"మాకు డబ్బు స్థిమితంగా వస్తుంది. ప్రజలకి మా మీదవున్న విశ్వాసమే మా పెట్టుబడి. డబ్బురాకపోదు- వస్తుంది. నెమ్మది నెమ్మదిగా వస్తుంది," అన్నాడు ఫాదరీ.

లక్ష డాలర్లకిపైగా ఖరీదు చేసే ఫారమ్‌ను పట్టున పది వేల డాలర్లు కూడా దగ్గిర లేకుండా కొందామనుకుంటున్న ఫాదరీ ఆత్మవిశ్వాసానికి విస్మయపడ్డాడు జోసఫ్.

"ఈ స్థలం ఎవరిది ?" అని అడిగాడు ఫ్లానగన్.

"బామ్ దంపతులది. డేవిడ్ బామ్ ఒమహా వ్యాపారస్థులలో పెద్దవాడు ; సహృదయుడే- కాని వ్యాపారం విషయంలో ఘట్టివాడు," అని వూరుకున్నాడు జోసఫ్.

ఫాదర్ ఫ్లానగన్ బాలరాజ్యం గురించిన పదచిత్రం యిస్తూండగా రాయిలా కూచుని, మాటాపలుకూ లేకుండా విన్నాడు డేవిడ్ బామ్.

"మాకు విరాళాలు స్థిమితంగా వస్తాయి. నెమ్మది నెమ్మదిగా వస్తాయి. రాకపోవు. చిన్న చిన్న మొత్తాలుగా పంపుతూ వుంటారు."

"ఫాదర్, మీరు ఒకటోరకమైన మతగురువులు. నేను ఒకటోరకమైన వ్యాపారస్థుణ్ణి. మీ ప్రయత్నంలో మీరు

విఫలులయితే మిమ్మల్ని ఎవరూ ఏమీ అనరు. నా వ్యాపారంలోగాని నేను దెబ్బతింటే, నాతోడివారందరికీ జవాబు చెప్పుకోవలసి వుంటుంది."

"మీ పెట్టుబడికి ఏమీ యిబ్బంది ఉండదు. ఈ పిల్లలు పెరిగిపెద్ద వాళ్ళయి, అమెరికాకి గౌరవం తీసుకొస్తారు."

"అది జూదం. చెడ్డపిల్లల గుంపు నొకటి పట్టుకొచ్చి, దానితో జూదం ఆడటానికి వొప్పుకోడు వ్యాపారం తెలిసిన మనిషి."

"చెడ్డ పిల్లలా? మా వాళ్ళు చెడ్డపిల్లలా? మిస్టర్ డేవిడ్, చెడ్డపిల్లలంటూ లేరు. వాళ్ళు పిల్లలు—భగవంతుని పిల్లలు!" అని బిగ్గరగా అరిచి, నుదిటిమీద స్వేదబిందువులు తుడుచుకున్నాడు. అలా తొందర పడకూడదు. ఇది వ్యాపారానికి సంబంధించిన సమావేశం.

"మిస్టర్ డేవిడ్, నేనుయిలా బిగ్గరగా ఎందుకు అన్నానంటే మా మూలధనం అతి స్వల్పమయినా, మా పిల్లలు ఎలాంటివాళ్ళో నాకు తెలుసు."

"మీకు వున్న విశ్వాసబలమే మీ మూలధనం," అన్నాడు డేవిడ్ బామ్ ఫాదరీలోని నిజాయితీ గ్రహిస్తూ.

అజాత శత్రువులాంటివాడు అలా బిగ్గరగా అరవడం వల్లనే ఆనాటికార్యం సానుకూలమయింది. కాని, ఫాదరీకి ఆ రహస్యం తెలియదు.

డేవిడ్ బామ్ చిరునవ్వుతో అన్నాడు: "ఆ నలభై ఎకరాలూ నాకుయిప్పుడు యిచ్చేదురుగాని. మిగతాది వాయిదాల ప్రకారం మీ వీలుచూసుకు యివ్వవచ్చు."

ఒక మతగురువు స్వప్నాన్ని నమ్ముకొని, లక్షడాలర్లు ఖరీదుచేసే స్థలం ఏ వ్యాపారస్తుడూ ఈవిధంగా యివ్వడు. ఫ్లానగన్ తనదగ్గిర వున్న రొఖ్ఖం తీసుకోమన్నాడు. కాని డేవిడ్ బామ్ పైకం పుచ్చుకోక, "అందులోని ప్రతి దమ్మిడీ మీరు కట్టించబోయే యింటికి కావలసి వుంటుంది; మీ దగ్గిరే వుంచండి," అన్నాడు.

"ఆ ఉదారబుద్ధి డేవిడ్ బామ్‌కి భగవంతుడే కలిగించి వుండాలి," అనుకున్నాడు ఫ్లానగన్. అవును, చెడ్డపిల్లలంటూ లేరు. తను చెప్పినమాట అక్షరాలా నిజం. యిల్లూ వాకిలీ లేని బీదపిల్లల్ని చూసి, వాళ్ళు చెడ్డవాళ్ళనుకుంటారు. అది తప్పుకాక ఒప్పు ఎలా అవుతుంది?

చెడ్డపిల్లలంటూ లేరు. చెడ్డవారైన తలిదండ్రులు వున్నారు; చెడ్డవైన పరిసరాలు వున్నాయి— అంతేగాని చెడ్డ పిల్లలంటూ లేరు—వుండరు. ఫాదర్ ఫ్లానగన్ హృదయం విజయోత్సాహంతో ఉప్పొంగి పోయింది.

## 21

కొత్త యింట్లోకి ఎప్పుడు వెళ్ళడమా అని పిల్లలలో హడావిడి బయలుదేరింది. నన్నొకసారి చూడనివ్వండి అంటే, నన్నొకసారి చూడనివ్వండి అంటూ పిల్లలు ఫాదరీ చుట్టూ చేరేవారు. వారిని జట్లుజట్లుగా విభజించి, ఒక్కొక్క జట్టునే పంపుతూండేవాడు ఓవర్ లుక్ ఫారమ్ చూసి వచ్చేందుకు.

తాత్కాలికంగా వుండేందుకు యిళ్ళు కట్టారు. మిలటరీ బారక్సులా నలుచదరపు కట్టడాలు అవి. వాటిలోనే

స్కూలూ, నివసించేందుకు, నిద్రపోయేందుకు గదులూ, భోజనశాల, ప్రార్థనా మందిరం, విరామశాల, చేతిపనులు నేర్చుకునేందుకు స్థలం-సమస్తం ఉండేవి.

అక్టోబరు 22న కొత్త ప్రదేశానికి కదలాలనుకున్నారు. ఏ కుర్రాడికా కుర్రాడు, తన సామాను తను పుచ్చుకు ట్రక్కులోకి ఎక్కి కూచున్నాడు. పిల్లలందరినీ అక్కడ చేరవేసిన తర్వాత, ఆఖరి ట్రిప్పులో ఫ్లానగన్, అతని పెంపుడు కుక్క కార్లో-యిద్దరూ వెళ్లారు. కార్లోకి కొత్త చోటుకి వెళ్ళడం యిష్టంలేదు- అయినా తప్పదుగా!

ఓవర్‌లుక్ ఫారమ్‌కి వెళ్ళి వెళ్లగానే పిల్లలు కాళ్ళు బలపాలు కట్టేటట్టు తిరగడం మొదలెట్టారు. వారికి ఎంత సంతోషమో చెప్పలేము. యిష్టమొచ్చినట్టు తిరగవచ్చు. ఎందుకలా తిరుగుతున్నావని పోలీసువాడు అడగడు. తలకి మించే అప్పులు వున్నప్పటికీ, ఫాదరీకికూడా నూతనోత్సాహం కలిగింది. ఈ స్థలం అంతా - తొంభై ఎకరాల స్థలం - తన పిల్లలది; తనశ్రమ వృథాకావడం లేదు.

ఓవర్‌లుక్ ఫారమ్‌కి వచ్చాకనే ఫ్లానగన్‌కి వేరే గదులు అంటూ ఏర్పాటయాయి. రెండే రెండుగదులు-ఒకటి ఆఫీసు గది, మరొకటి పడకగది. చిన్నరేకుల షెడ్డుని తన నివాసంగా మార్చుకున్నాడు ఫ్లానగన్.

ఆ ఫారమ్‌లో వున్న వ్యవసాయదారుని సహాయంతో వేసవి కాయగూరలు వేశారు పిల్లలు. అందరికీ కాయగూరలు పండించాలనే వుండేది. బేస్‌బాల్ కోర్టూ, ఫుట్

బాల్ కోర్టుకూడా చూసుకుంటూ వుండమని వారించేవాడు ఫ్లానగన్.

మామూలు పాఠశాల, వృత్తి విద్యాలయం, వడ్రంగం కార్ఖానా మొదలైనవన్నీ ప్రారంభమయాయి. వడ్రంగం బాగా తెలిసినవానిని రప్పించి, ఆయనచేత వడ్రంగంలో తరిఫీదు యిప్పించేవారు. పిల్లలు మామూలు చదువుకంటె చేతిపనులమీద ఎక్కువ ఆసక్తి చూపించేవారు. కుర్చీలూ, బల్లలూ, పుస్తకాల కేసులూ యిత్యాది కర్రసామాను చెయ్యడం సులువుగా నేర్చుకొని, స్కూలుకి కావలసినవి అక్కడే తయారు చేసేవారు.

ఇంటిచుట్టూ గోడ అనవసరమనీ. గది తలుపులకి తాళాలు వేసుకోడం మంచిపని కాదనీ ఫ్లానగన్ అనేవాడు. "మనం నిర్మించుకుంటున్నది జైలు కాదు. ఎత్తయిన ప్రహారీ గోడ అనవసరం. ఇది ఒక గృహనిర్మాణం. నలుగురూ కలిసివుండాలిగాని గోడలు అక్కర్లేదు."

ఫ్లానగన్ తన ఆరోగ్యంకూడా చూసుకోకుండా ఈ హోమ్ విషయమై శ్రమపడుతున్నాడు. నోరాఫ్లానగన్‌కి తన కుమారుని ఆరోగ్యం ఏమైపోతుందోనని భయంవేసి, తనే ఫారమ్‌లోకివచ్చి కొడుకు సంగతి ఒక కంట కనిపెడుతూ వుండేది.

బాలరాజ్యానికి నోరా ఫ్లానగన్ రాగానే పిల్లలకి మరింత ఆనందమయింది. అందరికీ ఆమె తల్లిలాటిది.

ఆమెకి దగ్గరగా వుండడమే మహాద్భాగ్య మనుకునేవారు పిల్లలు.

*  *  *

బాలరాజ్యం కిటకిట లాడుతూంది. ప్రవేశం దొరుకుతుందేమోనని అనేకమంది వస్తూండేవారు. రోడ్డుపక్క నిరాధారులై పడివున్న పిల్లలు కొంతమంది; "ఫాదర్ ఫ్లానగన్, ఈ కుర్రవాణ్ణి మీా సంరక్షణలోకి తీసుకు కాపాడండి" అను చీటీతో మరికొంత మంది—నిత్యమూ కొత్త పిల్లలు వస్తూనే వుండేవారు.

ఆ చీట్లు మెళ్ళోకట్టేవారు తమ పేరూ, యడ్రసూ యిచ్చేవారుకాదు. పిల్లవాడిని బుజ్జగించి, అతని ద్వారా కథ తెలుసుకో వలసి వచ్చేది. అటువంటి దిక్కులేని పిల్లలని వెనక్కి పంపేవాడు కాదు ఫ్లానగన్.

టెలిఫోనుద్వారా కొందరు, ఉత్తరాలద్వారా కొందరు, ప్రత్యక్షంగా వచ్చి కొందరు నిరాశ్రయులైన పిల్లలని ఫ్లానగన్‌కి అప్పగిస్తూండేవారు. ఇంక, న్యాయాధికారులూ పోలీసు ఆఫీసర్లూ, సంఘసేవా తత్పరులూ, యిరుగు పొరుగు వారూ అప్పగించే పిల్లల సంఖ్య చెప్పనే అక్కర్లేదు.

అందరినీ చేర్చుకోవాలని ఉండేది ఫ్లానగన్‌కి. కాని, స్థలం ఉండొద్దూ? అంచేత కొన్నికొన్ని కేసులు నిరాకరించక తప్పేదికాదు.

ఒకొక్కక్క సందర్భంలో తలిదండ్రులే పిల్లలని తీసుకొచ్చి అప్పగించేవారు. ఒకసారి ఒక తండ్రి తన కొడుకుని

తీసుకొచ్చి ఫ్లానగన్ ముందు నిలబెట్టి యిలా అన్నాడు:
"వీడి తల్లి యిల్లువిడిచి వెళ్ళిపోయింది. నేను పొద్దున్న వెళితే సాయింత్రంగాని యింటికిరాను. వీడికి సంగీతం నేర్పించాలని సరదా. ఆ చేతిలోవున్న ట్రాంబోన్ (trombone) చూస్తున్నారుగా!"

"మాకు యిక్కడ బాండు వాయించే కుర్రాళ్ళు ఉన్నారు. వాళ్ళతో కలిసి నేర్చుకుందువుగాని," అన్నాడు ఫాదరీ కుర్రవానితో.

"ఊహు, ఇక్కడకాదు. మా యింట్లోవుండి నేర్చుకుంటాను. మా అమ్మా నాన్నా దగ్గిరే ఉంటాను," అన్నాడు కుర్రవాడు బింకంగా.

తండ్రి ఆగ్రహన అంతంత మాత్రమే అవడంచేత, ఆ కుర్రవాడిని ఫ్లానగన్ దగ్గిర వొదిలేశాడు. 1925 నాటికి ఆ పిల్లవాడు మామూలు పరీక్షలుపాసై, తర్వాత ట్రాంబోనిస్టుగా పెద్ద పేరు ప్రఖ్యాతులు గడించాడు.

* * *

అప్పులన్నీ తీరాక పెద్దయిల్లు కట్టుకుందామని, తాత్కాలికంగా పనికొచ్చే చిన్న చిన్న యిళ్ళు కట్టుకున్నారు ఓవర్ లుక్ ఫారమ్‌మీద. కాని, యిక్కడికి వచ్చినప్పట్నుంచీ, పైనుంచి వచ్చే పిల్లల సంఖ్య అధికం కావడంతో ప్లానులు అనుకున్నట్టు అయేవికాదు.

రెండు వందలమంది పిల్లలు వున్నారు యిప్పటికే. ...రాశాలద్వారా వచ్చేపైకం ఒక పట్టాన సరిపడటంలేదు.

ఫ్లానగన్ హోమ్ పరిస్థితి నట్టనడిసముద్రంలోని నావలా ఉంది. ఒమహాలోని పురప్రముఖులు కొందరు ఈ విషయమై ఆలోచించడానికి సభ జరిపారు.

"ఫాదరీకి ఏమి కావాలో మనకి తెలుసు. ఆ పిల్లలందరూ వుండేందుకు తగినంత పెద్దయిల్లు కావాలి," అన్నాడొక ఉపన్యాసకుడు.

"అతనికి కావలసిన భవనం కట్టించేందుకు కొన్ని లక్షల డాలర్లు అవుతుంది."

"అవనీయండి. ప్రజల దగ్గిరనుంచి పోగుచేద్దాం—యిది ప్రజోపయోగం కోసం కదా!"

ఆ రాత్రే పురప్రముఖులు, ఫ్లానగన్ గృహనిర్మాణ నిధికి రెండులక్షల డాలర్లు కావలసి వుంటుందనీ, అది పోగుచేసి బాలరాజ్యానికి యివ్వడం పౌర ధర్మమనీ విజ్ఞప్తి చేశారు.

* * *

ప్రజలు యావన్మందీ ఈ నిధి సేకరణని ధర్మకార్యంగా భావించారు. ఏదో విరాళాలు పోగుచెయ్యడంలా కనిపించిన ఈ కార్యకలాపం, కొద్దిరోజు లయేటప్పటికి పెద్ద ఉద్యమంలా తయారయింది.

ఆరంభంలో వసూళ్ళు ప్రోత్సాహకరంగా లేవు. మొదటివారం గడిచేటప్పటికి, నిధిని ప్రారంభించిన పెద్దలు కూడా నీరైపోయారు.

అప్పుడు జె. డి. డేవిడ్సన్ అను యువకుడు ఈ భారం తన బుజాలమీద వేసుకున్నాడు. పొడుగ్గా సన్నగా వుండే డేవిడ్సన్ కడు సమర్థుడు. తను ప్రొటెస్టెంటు అయినప్పటికీ కాథలిక్ మతగురువు ఫ్లానగన్ అంటే అతనికి ఎంతో గౌరవం. ఎలాగయినాసరే ఫ్లానగన్ హోమ్‌ని నిలబెట్టాలనుకున్నాడు. పెద్దపెద్దవాళ్ళు చాలామంది తెలుసు అతనికి. మత భేదాలు, పాటించకుండా నిధి సేకరణకి సాయం చెయ్యమని కోరాడు. ఇతనికి అండగా మరి ముగ్గురు ప్రముఖులు నడుం కట్టారు నిధి సేకరణ కోసం—మారిస్ జాకబ్స్, హెన్రీమాన్ సీక్స, ఫ్రాన్సిస్ మాచూస్. మొత్తం నలుగురిలోనూ ఒకతను ప్రొటెస్టెంటు, ఒకతను కాథలిక్, మిగతా యిద్దరూ యూదులు. ఈనాటికి కూడా ఒమహాపౌరులకి బాలరాజ్య నిధిసేకరణ దృశ్యాలు జ్ఞాపకం వున్నాయి.

నలుగురు కార్యకర్తలూ ఒక విషయం కూడబలుక్కున్నారు. వీధుల్లో టపాకాయలు పేల్చి అయినాసరే, జన సామాన్యానికి ఈ విషయమై ఆసక్తి కలిగేటట్టు చెయ్యాలి. టపాకాయలు పేల్చనవసరం లేకపోయిందనుకోండి. పెద్ద పెద్ద దీపాలు పుచ్చుకొని రాత్రివేళ ఉత్సవం మాదిరి ప్రచారం చేసేవారు. ప్రచారకుల వెంట ప్రజలు గుంపులుగా వచ్చేవారు. నాలుగురోడ్లూ కలిసేచోటనో, సందుచివరనో నుంచుని, రెండు మూడు పాటలుపాడి, ఆ తర్వాత చిన్న ఉపన్యాసం యిచ్చే వారు. ఉపన్యాసం అయ్యాక ఫాదర్ ఫ్లానగన్ విజ్ఞప్తి:

"వందలకొద్దీ అనాథబాలురు ఈ ఒమహాపట్టణంనుంచి మా దగ్గిర కొస్తున్నారు. బక్క చిక్కిపోయి, చింకిపాతరలతో

వున్న ఆ పిల్లలని మీరు చూడాలి. మీ పిల్లల్లాటివారే వాళ్ళు; వాళ్ళని మీరు కనిపెట్టకపోతే ఎవరు కనిపెడతారు ?''

ఆ తర్వాత నిధి సేకరణ ప్రారంభమయ్యేది.

ఛార్లెస్ కెన్వర్తీ అను బాల ఉపన్యాసకుడొకడు ప్రజా హృదయాన్ని ద్రవింపజేసేవాడు. ఫ్లానగన్ హోమ్‌లోని అనాధ బాలకులలో కెన్వర్తీ ఒకడు.

''ఫ్లానగన్ హోమ్‌లో చేర్చుకోకుండా యివ్వాళ ముగ్గురు పిల్లల్ని వెనక్కి పంపేయవలసి వచ్చింది. వారిని చేర్చుకునేందుకు స్థలం లేదు. తల వొరగేసుకొని, నిరాశతో వెళ్ళిపోతున్న ఒక కుర్రవాణ్ణి చూశాను నేను. అతన్ని తలుచుకొని ఎన్నిసార్లు ఏడ్చానో చెప్పలేను. వెళ్ళిపోతున్నాడు ఆ అబ్బాయి! ఎక్కడికి వెళ్తాడు ?...ఎక్కడికి ?

''అతనికి యిల్లు లేదు; స్నేహితులు లేరు; ఏమీ లేదు. సందుగొందులలో బతికేందుకు వెళ్ళి, పోకిరీగా తయారవుతాడు.

''నేను మీకొక వస్తువు అమ్మడానికి వచ్చాను— అనాధ బాలుర ప్రేమ. నాలుగు డబ్బులు పడేసి మీరది కొనుక్కోండి. డబ్బు ఒక్కటే ప్రధానం కాదు. డబ్బుకంటె ఎక్కువ విలువ కలిగినవి రెండు వున్నాయి. భగవంతుని యెడ విశ్వాసము; సోదర మానవులపట్ల ప్రేమ. మీకు లక్షలు వుండవచ్చు. కాని, ఈ రెండూ లేనప్పుడు మీ బ్రతుకు వృధా.

"బాలరాజ్యంలో పిల్లలు ఉత్తమ పౌరులుగా అవుతారు. మా ఫారమ్‌లో మాకు ఆవులు, కోడిపెట్టలు, గుర్రాలు అన్నీ వున్నాయి; గృహనిర్మాణం కూడా కొనసాగితే బాలరాజ్యం మా పాలిట స్వర్గధామం."

సినీమా చిత్రంలోని కన్నీటిభావలా ఉందా? అవ వచ్చు. కాని ఫాదర్ కృషిని సభికులు కళ్లారా చూస్తున్నారు. శాల ఉపన్యాసకుడి మాటలు విన్నాక, జేబులు ఖాళీ చేసుకు వెళ్ళిపోయేవారు ప్రజలు.

రెండులక్షల డాలర్లు వసూలు కావాలి. ఎంత తంటాలు పడ్డా, వసూలైన మొత్తం ఆ పొలిమేరలకి కూడా రావడం లేదు. ఒకపక్క అనుకున్న టైమయిపోతోంది. అప్పుడు ఒమహా నగర్ స్త్రీలు నిధి సేకరణకి పూనుకున్నారు. వారిలో ముఖ్యురాలు మిసెస్ ఆర్థర్ ముల్లెన్.

ముల్లెన్ సతి ఈ సేకరణకి "వుమెన్స్ బకెట్ బ్రిగేడ్" అని పేరుపెట్టింది. అయిదారుగురు మహిళలు ఒక్కొక్కజట్టు చొప్పున, ఒమహాలో ఏ ఒక్కగడపా వొదిలి పెట్టకుండా వసూళ్ళకి పూనుకున్నారు. హొటళ్ళూ, క్లబ్బులూ, షాపులూ, నాట్యశాలలూ—ప్రతిచోటికీ వెళ్ళి తోచినంత ధర్మం చేయమనేవారు. జట్లు జట్లుగా బకెట్లు పుచ్చుకువెళ్ళి, ఫ్లానగన్ హొమ్ కోసం వసూలు చేశారు ఒమహా స్త్రీలు. స్త్రీలు పూనుకుని వుండకపోతే వసూలయ్యేదే కాదు ఆ మొత్తం.

నిధి సేకరణ అనుకున్న టైములో విజయవంతంగా పూర్తి అయింది. వసూలైన మొత్తం రెండులక్షల పదిహేను వేల డాలర్లు.

ఓవర్‌లుక్ ఫారమ్‌కి వచ్చి ఏడాది తిరక్కుండానే, అయిదంతస్తుల భవంతి కట్టేందుకు తగినంత సొమ్ము పోగు బడింది. 1922 మార్చిలో భవననిర్మాణం ప్రారంభించారు. ఫాదర్ ఫ్లానగన్ మహా సంతోషంగా ఉన్నాడు. కాని, గడ్డు రోజులు ఇంకాముందు వున్నాయని ఆయనికి తెలియదు.

## 22

వసూలయిన పైకం భవననిర్మాణంకోసం వెచ్చింప బడుతూవుండేది. తిన్నగా కాంట్రాక్టరులే తీసుకునేవారు— ఫ్లానగన్ చేతుల్లోకి వచ్చేదికాదు. ఒక వైపున అయిదు అంతస్తులభవనం లేస్తోంది—మరొకవైపున ఫ్లానగన్ డబ్బుకి కటకట లాడుతున్నాడు. పిల్లల తిండీ బట్టా మొదలయిన నిత్య జీవితావసరాలకి పైకం కనపడేదికాదు. పాలవాళ్ళూ, కిరాణా కొట్టువాళ్ళూ డబ్బు చెల్లిగట్టనిదే సరుకు యివ్వడం కుదరదు అనేశారు.

ఒకసారి రొట్టెల కంపెనీవాడు అన్నాడు: "ఆ ట్రక్కులో మీకు కావలసిన రొట్టెలు వున్నాయి. డబ్బు చేతిలో పడేస్తే, రొట్టెల గంపలు దింపుతాను. లేకపోతే లేదు."

డబ్బు విషయమై అప్పులవాళ్ళు నిష్కర్షగా ఉంటు న్నారు. ఫ్లానగన్ హోమ్‌కి సరుకులు సప్లయిచేసే వారందరూ

ఈ సంస్థ యొవత్తూ, ఏ రోజునో ఒక రోజున దబీమని కూలి పోతుందనే అపనమ్మకంతో ఉండేవారు.

రొట్టెలు వీధి గుమ్మంలోకి తీసుకొచ్చి, డబ్బు యివ్వని కారణాన వెనక్కి పట్టుకుపోవడం అనేక సార్లు జరిగింది. ఫ్లానగన్‌కి ఈ పరిస్థితిని ఎలా ఎదుర్కోవాలో తోచేదికాదు.

ఒకరోజున సాయంత్రం వేళ నీగ్రో కుర్రవాడొకడు చప్పట్లు కొడుతూ, పాటపాడుతూ నృత్యం చెయ్యడం బాల రాజ్యం పిల్లలుచూసి, ఆ నీగ్రో బాలుణ్ణి అనుకరించ బోయారు ఈ పిల్లలుకూడా. ఇదంతా పరిశీలనగా చూస్తున్న ఫ్లానగన్‌కి ఒక ఆలోచన తట్టింది. కొందరు పిల్లలకి నాట్యం అదీ నేర్పి, పాటలు పాడిస్తూ ప్రదర్శనలుయిస్తే, హోమ్‌కి కావలసిన డబ్బు వసూలవుతుందేమో! ఇప్పుడు నిత్య జీవితావసరాలకి డబ్బు కావాలి. రెండులక్షల డాలర్లకి పయిగా వసూలు చేసి యిచ్చిన ఒమహా ప్రజలను మళ్ళా విరాళాలడగడం న్యాయంకాదు. ఒకసారి బాలరాజ్యం పిల్లలచేత దగ్గిరలోవున్న మరొక పట్నంలో చిన్న ప్రదర్శన యిప్పించాడు ఫ్లానగన్. వసూలైన పైకం రైలు ఛార్జీలకే సరిపడింది. ఇది పని గాదను కుని, సర్కస్ ట్రూపుకిమల్లే గుర్రపు బగ్గీలు బాగుంటాయను కున్నాడు. సెకండ్ హాండ్ గుర్రపు బళ్లు కొని, వాటికి రంగులూ అవీ వేయించి, బాలరాజ్యం ట్రూప్ తయారు చేశాడు.

ఒమహా ప్రజలలో జుట్టు నెరసిన ముసలివాళ్ళు, "మళ్లా మరొక అవకతవక పని మొదలెట్టాడా 'దొంగలబడి'

నాయకుడు!" అని అన్నారు. బాలరాజ్యమంతా వాళ్ళగో ష్ఠులతోనూ,రిహార్సల్సతోనూ మహా హడావిడిగా ఉంది.

ప్రయత్నాలన్నీ పూర్తి అయాక, బాలరాజ్యం ట్రూప్ పిల్లలు — "ఫాదర్ ఫ్లానగన్ బాలరాజ్యం — సాటిలేని బాలనటులు" అని చెరోవైపునా ఎర్రటి గిల్టుఅక్షరాలువున్న బళ్ళపై ఎక్కారు. సూర్యకాంతిలో ఆ అక్షరాలు ధగధగ మెరుస్తూండేవి. ఈ ట్రూప్‌కి యజమాని నార్టన్. మొదటి ప్రదర్శన ఒమహాకి దక్షిణానవున్న ఫ్రీమాంట్ పట్టణంలో యిచ్చారు.

ఫ్రీమాంట్ వార్తాపత్రికలో అరపేజీ ప్రకటన ఈ విధంగా పడింది:

"ఫాదర్ ఫ్లానగన్ పిల్లల ప్రదర్శనలు. పదహారుగురు పిల్లల బాండు వాద్యం వినండి. ఎన్నో తమాషాలు చూడండి. ఉపన్యాసకులు, నృత్యకోవిదులు, హాస్యకారులు, పాటగాళ్ళు- ఎందరెందరో పాల్గొంటున్నారు. కమనీయగానం. ప్రవేశరుసుము పెద్దలకి ఏభై సెంట్లు, పిల్లలకి యిరవై అయిదు సెంట్లు. ఇంత తక్కువ రేట్లలో యింత ఉత్తమ ప్రదర్శన మీరు చూసి వుండరు"

మొదటి రోజు హాలుఅంతా నిండిపోయింది. ఊళ్ళోఉన్న ముఖ్యులందరూ వచ్చారు. ప్రదర్శన చాలా చక్కగా ఉంది. "నాకే ఒక యిల్లు వుంటేనా...."అని ఒక కుర్రవాడు పాడుతున్నప్పుడు ప్రేక్షకులు నిజంగా కన్నీళ్ళు కార్చారు. తెర

పక్కనుంచి ఫాదర్ ఫ్లానగన్ యిటు తన పిల్లలనీ, అటు ప్రేక్ష కులనీ యిద్దరినీ చూసి ఆనందభరితుడయ్యాడు.

కొన్నాళ్ళపాటు ఈ ప్రదర్శనలు సక్రమంగానే జరిగాయి. ఒక ఊళ్ళో ప్రదర్శన యిచ్చాక, మరొక వూరికి వెళ్తూండేవారు. కొత్త ఊరు చేరుకోగానే ఆ ఊళ్ళో పిల్లలందరూ వచ్చి స్వాగతం చెప్పేవారు. "మమ్మల్ని కూడా మీ ట్రూపులో చేర్చుకోండి" అని యితరపిల్లలు అడిగినప్పుడు నార్టన్—"మీకొక యిల్లు వుంది—మీరు అదృష్టవంతులు. ఇక్కడ వున్న వాళ్ళంతా యిల్లూ, వాకిలీ లేని నిర్భాగ్యులు," అని వారికి నచ్చజెప్పి వెనక్కి పంపించేస్తూండేవాడు.

మొత్తంమీద పేరు అంటూ వచ్చిందిగాని, లాభం రాలేదు. ఆర్థికంగా ప్రయోజనం కనిపించలేదు. పిల్లలకి ఈ ప్రయాణాలూ, ప్రదర్శనలూ అలవాటైపోవడంతో, వారి ఉత్సాహం కూడా కాస్త చప్పబడింది.

• • •

ఈ మాదిరి కంపెనీలన్నిటికీ మల్లేనే ఈ కంపెనీ కూడా ఒకచోట యిరుకున పడింది. బళ్ళతో వారు పట్టణం పొలిమేరకి వచ్చారు. స్వాగతం చెప్పే పిల్లలు కనిపించక పోయేటప్పటికే వారి ప్రాణాలు గతుక్కుమన్నాయి. బాలరాజ్యం పిల్లలు తమ పట్నంలో ప్రదర్శన యివ్వనక్కరలేదని తీర్మానించారు పూర్వాచార పరాయణులైన పెద్దలు. మాటామంతీ లేకుండా మాయమైపోయాడు—బాలరాజ్యం తరఫున హాలు బుక్ చెయ్య

డానికి గాను వచ్చిన ఏజంటు. బాలరాజ్యం నటీనటుల కీర్తి ప్రతిష్ఠలు వారిని ఈ ఉపద్రవంనుంచి తప్పించ లేకపోయాయి.

జేబులో డబ్బు ఒకపూట భోజనానికి సరిపడుతుందని టెలిఫోన్ చేశాడు నార్టన్ ఒమహాలో వున్న ఫాదర్ ఫ్లానగన్‌కి.

"అక్కడే వుండండి. ఏమీ కంగారు పడవద్దు. నేను రైలులో వస్తున్నాను," అన్నాడు ఫాదర్.

ఫ్లానగన్ కొంతపైకం పుచ్చుకు వచ్చాడు. నిరాశ పడవద్దనీ, యిక్కడ కాకపోతే మరొక గ్రామంలో ప్రదర్శన యివ్వవచ్చుననీ, అలా ప్రదర్శనలు యిస్తూ ఒమహా చేరుకోడమే చూసేవారికి బాగుంటుందనీ అన్నాడు ఫ్లానగన్.

ప్రదర్శనలు యిచ్చుకుంటూ వస్తున్నారు. పర్సులో డబ్బు అయిపోయింది—లింకన్ నగరం చేరుకునేటప్పటికి పిల్లలు ఆకలితో మలమల మాడుతున్నారు.

"ఇక్కడి జైలు అధికారి నాకు తెలిసినవాడు. అతన్ని పల్కరించి వద్దాం," అన్నాడు ఫ్లానగన్.

ఫ్లానగన్‌ని ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించాడు ఆ పాత మిత్రుడు. ఆపూటకి భోజన సమస్య తేలిపోవడమే కాకుండా, ఆ రాత్రి బాలరాజ్యం పిల్లలు జైలులో వున్న ఖైదీలకి ఒక ప్రదర్శన యిచ్చారు. బాలగాయకుల పాట విని అయిదువందలమంది ఖైదీలూ తన్మయులయారు.

* * *

మర్నాడు, అక్కడనుంచి తిన్నగా ఓవర్ లుక్ ఫారమ్‌కి ప్రయాణమయారు. తన ప్రయత్నంలో ఓడిపోయాననుకున్నాడు ఫ్లానగన్. ఎందుకంటే, యింత శ్రమపడ్డా, డబ్బు ఏమీ మిగలలేదు. ఇంటికి వచ్చి, ఉత్తరాలు చూసుకునేటప్పటికి, అతని నిరుత్సాహం కాస్తా మాయమయింది: ఎంతరో ప్రముఖులు తనకి ధైర్యం చెబుతూ, తన కృషిని అభినందిస్తూ లేఖలు రాశారు. కొందరు చెక్కులు పంపించారు; కొందరు పైకం పంపించారు. బాలరాజ్యం పిల్లలు వృద్ధిలోకి వస్తారని అందరూ దీవించారు.

వారి ఆప్యాయతా ఆత్మీయతా తెలుసుకునేటప్పటికి ఫ్లానగన్‌కి మళ్ళీ ధైర్యమొచ్చింది. నార్టన్‌తో ప్రదర్శనల విషయమై తిరిగీ ముచ్చటించాడు. నిజానికి, వారు భయపడ్డంత నష్టంలేదు. మొదటిప్రయత్నంలో దాని ఖర్చులు దాని కొచ్చాయి. వ్యాపారరీత్యా అది శుభశకునం. ఈసారి గుర్రపుబళ్ళుగాక రైలు మీద ప్రయాణం చేస్తేసరి!

బాలరాజ్యం గాయకబృందం గురించి పూరూరా కథలూ గాథలూ చెప్పుకుంటున్నారు. ప్రతి పట్నంలోనూ వీరికి అఖండ స్వాగతమే. రాత్రివేళ ప్రదర్శనలు యిచ్చి, పగటివేళ తమ పాఠాలు చదువుకుంటూండే వారు ఈ పిల్లలు. ఈ సారి క్రిస్‌మస్ నాలుగురోజులు వుండనగా, ఓవర్ లుక్ ఫారమ్‌కి మంచి లాభాలతో తిరిగివచ్చారు.

ఫాదర్ ఫ్లానగన్‌కి మంచి రోజులు అవి. అయిదంతస్తుల భవనాన్ని కట్టడం అయిపోయింది. పిల్లలు తమకొత్త యింట్లోకి

మూారారు. ప్రజలవద్దనుంచి విరాళాలు కూడా ధారాళంగా వస్తున్నాయి.

కాలక్రమేణా ఫ్లానగన్ పిల్లల ప్రదర్శనలు ప్రజా సముదాయాన్ని విపరీతంగా ఆకర్షించేవి. ప్రదర్శనలకోసమని వేరే కారు కొనుక్కున్నారు. ఆ ప్రయాణం చేస్తూ, ఒక్కొక్క సీజన్‌కి ఒక్కొక్క మాదిరి ప్రదర్శన చొప్పున యిస్తూండేవారు. కారులో వెళ్తారు గనక, పిల్లలు తిను వంట తాము చేసుకునేవారు. సిస్టర్ నెల్లీ ఈ ప్రయాణాలలో పిల్లలకి సాయంగా వుండి, వారిని కనిపెడుతూ వుండేది.

ప్రదర్శన అయిపోయాక ఎవరైనా వచ్చి ఫలానా పిల్లవాడిని పెంచుకుంటామని అంటే, ఫ్లానగన్ వెంటనే అనుమతించేవాడు కాదు. అప్లికేషన్ బాలరాజ్యానికి పంపమనేవాడు. ఈ పెంచుకోదలుచుకున్న వారి గురించిన మంచీ చెడ్డా ఫ్లానగన్ స్వయంగా వాకబు చేసి, తనకి సమ్మతిగా వున్న మీాదట దత్తతకి అంగీకరించేవాడు.

పెంచుకుంటామని అడిగే పెద్దలు ఒకపక్క, ట్రూప్‌లో చేరుతామని అడిగే పిల్లలు మరొకపక్క. ఇల్లూ వాకిలీ లేని అనాధబాలురని మట్టుకే బాలరాజ్యంలో చేర్చుకునేవాడు ఫ్లానగన్. మిగతావారు అక్కడ ఎందుకు?

రాళ్ళనుకూడా కరగించే గుణం గానంలో వుందని ఫ్లానగన్ విశ్వాసం. "హృదయంలో సంగీతవున్న పిల్లలు చెడ్డవాళ్ళు కావడం అసంభవం," అనేవాడు.

1941 లో ఫాదర్ ఫ్రాన్సిస్ స్మిత్ ని బాలరాజ్యానికి తీసుకువచ్చి, పిల్లలకి గానకళా శిక్షణ యివ్వమని కోరాడు. ఆయనదగ్గిర విద్యనేర్చుకున్న బాలరాజ్య గాయక బృందం అపూర్వఖ్యాతిని ఆర్జించింది. పదిహేనుసార్లు యింట్లోనుంచి పారిపోయిన ఎన్ రిక్ అను మెక్సికన్ బాలుడు బాలరాజ్య మనస్తత్వవేత్తల సలహాతో గాయకబృందంలో చేర్చుకోబడి ప్రఖ్యాత పురుషుడయాడు.

## 23

1927 నాటికి బాలరాజ్య విద్యాలయంనుంచి రెండు వేలమంది విద్యార్థులు ఉత్తీర్ణులై, ఉన్నతవిద్యకై వెళ్లారు. ఒకప్పుడు చెడ్డపిల్లలుగా పిలువబడ్డ వీరు, ఉత్తమ పౌరులుగా వృద్ధిలోకి వచ్చారు.

ఫాదర్ ఫ్లానగన్ కీ, బాలరాజ్యానికీ కీర్తిప్రతిష్ఠలు వచ్చాయి. పెద్దపెద్ద వాళ్ళందరూవచ్చి ఈ బాలరాజ్యాన్ని చూసి పోతూండేవారు. డి వెలరా, కూలిడ్జి మొదలైన ప్రఖ్యాత నాయకులు యిక్కడికివచ్చి, ఫ్లానగన్ ని ప్రశంసించి, పిల్లలని దీవించి వెళ్తూండేవారు.

స్కూలు పెద్దదయింది; వృత్తివిద్యాశాలకూడా పెరిగింది. కొత్తటీచర్లనీ, సిస్టర్లనీ ఆఫీసు సిబ్బందిలో చేర్చుకున్నారు. శాస్త్రీయపద్ధతుల ప్రకారం పంట పండించడం, కూరగాయలు వేయడం మొదలైనవి చేస్తూండేవారు. రేకుల షెడ్డులో రెండు గదులలో ఉంటున్న ఫాదర్ ఫ్లానగన్

ఎలకలబాధ భరించలేక, చిన్న కుటీర మొకటి తనకిగాను కట్టించుకున్నాడు.

కాలం గడుస్తోంది. ఫ్లానగన్ పాత స్నేహితులు కొందరు మరణించారు. తండ్రి చనిపోయాడు; హోమ్ ప్రారంభించేందుకు అనుమతిచ్చిన ఆర్చిబిషప్ హార్టీకూడా మరణించాడు.

కొన్నాళ్ళపాటు ఫ్లానగన్ తల్లి నోరా బాలరాజ్యంలో ఉంది. కాని, అక్కడి కార్యభారం ఆమె వయసుకి మించినదవడంచేత, కూతురు యింటికి వెళ్ళింది. నోరా స్థానాన్ని ఫ్లానగన్ సోదరి అయిన నెల్లీ భర్తీ చేసింది. ఒక వేసవిలో ఫ్లానగన్, నెల్లీ విశ్రాంతికోసమని యూరప్ వెళ్ళారు. అప్పుడు ఫ్లానగన్ నెల్లీకి తను ఏ పర్వత శ్రేణుల దగ్గరవుండి చదువుకున్నాడో అవన్నీ చూపించాడు.

ఫ్లానగన్ పెద్దవాడయ్యాడు; సన్నబడ్డాడు; మనిషి ఒకరకంగా ఈ బాలరాజ్య నిర్వహణతో అలిసిపోయాడు. మొహంలో అలసట కనిపించవచ్చుగాని, పిల్లలపెంపకం విషయమై అతనికున్న అభిప్రాయాలు ఆవగింజంత కూడా మారలేదు. ప్రేమ, ఓర్పు పరస్పరానురాగం— వీటితో పిల్లల సమస్యలన్నీ పరిష్కరించవచ్చు. ప్రతి కుర్రవానికీ వ్యక్తిత్వం యిచ్చి చూడటం నేర్చుకోవాలి.

పిల్లల విషయం కాదుగాని పెద్దల విషయమే బాధగా ఉండేది ఫాదరీకి. భౌతికవాదం విస్తరించడంవల్ల మనుషుల ఆలోచనలు మారిపోయాయి; మత సంబంధమైన శిక్షణ

యింట్లో ఉండేదికాదు ; విడాకుల కేసులు పెరగజొచ్చాయి. కుటుంబాలు శిథిల మవడంతో పిల్లలజీవితం కంటకప్రాయ మయేవి.

## 24

డాక్టరు ఫ్లానగన్‌ని వారించారు. తాము చెప్పినమాట చెవిని వేసుకోకపోతే ఆరోగ్యం చెడిపోవడం ఖాయమన్నారు. అంతకీ ఫ్లానగన్ వినలేదు. ఒకపక్క హోమ్ పెరుగుతూ వుండగా, తనపని తగ్గించుకోవడం ఎలా కుదురుతుంది ?

బాలరాజ్యం ఒక చక్కటి ప్రాంతంగా తయారయింది. ఆ సంస్థ ఆస్తిపాస్తులు 50 లక్షల డాలర్లు విలువ చేస్తాయని అంచనా వేశారు. ఇప్పటికీ దాని నిర్వహణ సామాన్యపౌరులు పంపే విరాళాల మూలకంగానే జరుగుతోంది. విరాళాలు వుట్టినే రావు. సంస్థ గురించి వారికి చెబుతూ వుండాలి. ఈ ప్రజాహితకార్యానికి యితోధికసాయం చేయాలని పదేపదే ఉపన్యాసాలద్వారా వారికి విజ్ఞప్తి చేస్తూండాలి.

ఆఫీసు సిబ్బంది ఎందరు వున్నప్పటికీ ఫ్లానగన్ స్వంతంగా చూసుకోవలసిన పనులు అనేకం ఉండేవి. ఎవరైనా కుర్రవాడికి ఆపరేషన్ అంటే, తను పక్కని వుండి, కన్న తండ్రికి మల్లే ఆ అబ్బాయికి ధైర్యం చెప్పేవాడు. స్వంతంగా చూడవలసిన పిల్లల సమస్యలు గాక, వ్యవహార సంబంధమైన లావాదేవీలు–తను తప్పనిసరిగా చూసుకోవలసినవి – చాలా ఉండేవి. పాతమేడ అలా వుండగా, 1929 లో మరికొన్ని కొత్త కట్టడాలు ప్రారంభించారు. ఈసారి అయిదు భవనాలు కడుతున్నారు. అయిదింటికి మొత్తంమీద పాతిక లక్షల

డాలర్లు కావాలి. ఈ తాలాట చెరువు వున్న ఆటస్థలం, వృత్తి విద్యాశాలశాల, పై తరగతి విద్యార్థుల నివాసస్థలం, డ్రయ్ క్లీనింగ్ ప్లాంట్, బట్టలు వుతికేలాండరీ—ఈ అయిదు కట్టడాల పనీ 1920 సెప్టెంబరులో ప్రారంభించాడు. ప్రారంభించిన నెల దినాలలో ప్రపంచ ఆర్థిక మాంద్యం వచ్చింది. చాలా మంది స్నేహితులు ప్రస్తుతానికి ఈ పని విరమించమని ఫ్లానగన్‌కి హితవు చెప్పారు. కాని, ఆయన తన మొండిపట్టు విడవలేదు.

1930 ఆకురాలుకాలంనాటికి పనిపూర్తి చేయించాడు. ఆ భవన ప్రారంభోత్సవం ఎంతో ఘనంగా జరిగింది. ఉన్నత ప్రభుత్వోద్యోగులు, ప్రఖ్యాత రాజకీయ నాయకులు, పూజనీయులైన మత గురువులు, వ్యాపార ధురంధరులు అందరూ ఆనాటి ఉత్సవంలో పాల్గొని ఫాదర్ ఫ్లానగన్ అమోఘ కృషిని వేనోళ్ళ కొనియాడారు. "దొంగలబడి" యింతదవడం ఆశ్చర్యకరమన్నారు. యూదులూ, ప్రొటెస్టెంటులూ, కాథలిక్కులూ అన్ని మతాలవారూ ఫ్లానగన్‌ని నిండుహృదయంతో మెచ్చుకున్నారు.

1931 వసంతకాలంలో ఒమహా ప్రజలు ఫ్లానగన్‌ని ప్రథమ పౌరునిగా (ఫస్ట్ సిటిజన్) గౌరవించారు. ఆ స్వాగతోత్సవసందర్భంలో వెయ్యిమంది పురప్రముఖులు పాల్గొన్నారు. ఫ్లానగన్ పక్కని అతని తల్లినోరా కూచుంది. ఎనభై యేళ్ళ తల్లి తన కుమారుడికి జరుగుతున్న ఈ నూతన గౌరవ మర్యాదలు ఎందుకో తెలియక, "ఏమిటి నాయనా యిదంతా?" అని అడిగింది కొడుకుని అమాయకంగా.

విషయం చెప్పి, "ఈ గౌరవం మొట్ట మొదట నీకు, తర్వాత నాకు," అన్నాడు ఫ్లానగన్ తల్లితో.

కరతాళధ్వానులతో సభాస్థలి మారుమోగింది. ఫ్లానగన్ కొద్దిగా డగ్గుతున్నట్టు పత్రికా విలేఖరులుకూడా గుర్తించారు.

1931 లోనే ఒక మధ్యాహ్నం వేళ టేబుల్ ముందు కూచున్న ఫ్లానగన్ గుండె నొప్పితో బల్లమీదికి వొరిగాడు. అతి ప్రయాసతో లేచి తన కుటీరం చేరుకున్నాడు.

కాస్త విశ్రాంతి కావాలనీ, ఏమీ ఫరవా లేదనీ సోదరి నెల్లీకి చెప్పాడు. ఆమె యింట్లో వున్న మందు యిచ్చి, తక్షణం డాక్టరుకి కబు చేసింది. డాక్టర్లు అనుకున్నంతా అయింది. ఫ్లానగన్ ఊపిరితిత్తులు పాడయాయి. ఆరు నెలలపాటయినా శానిటోరియమ్‌లో ఉండాలన్నారు.

* * *

ఈసారి ఫ్లానగన్ కిమ్మనకుండా డాక్టర్లు చెప్పినమాట విన్నాడు. డెన్వర్ శానిటోరియమ్‌లో వుండేందుకు ఏర్పాటులు చేశారు. ఆయన శానిటోరియమ్‌నుంచి తిరిగి వచ్చేదాకా, అన్నగారైన ఫాదర్ పాట్రిక్ బాలరాజ్య వ్యవహారాలు చూడగలందులకు వొప్పుకున్నాడు.

ఫ్లానగన్ శానిటోరియమ్‌కి వెళ్తున్న రోజున బాలరాజ్యం పిల్లలందరూ బారులు తీర్చి నుంచున్నారు. తను త్వొందరలోనే వస్తానని వాళ్ళకిచెప్పి. కారు ఎక్కాడు ఫ్లానగన్ చెప్ప లేనంత మనోవేదనతో.

అదృష్టవశాత్తూ కొద్ది నెలలలోనే ఆయన ఆరోగ్యం బాగుపడింది. మళ్ళా తన కర్తవ్యం చూసుకునేందుకు వచ్చేశాడు బాలరాజ్యానికి.

## 25

1934 డిసెంబరులో అమెరికా ప్రభుత్వం బాలరాజ్యాన్ని ఒక మునిసిపాలిటీగా గుర్తించి, దానికి ఒక పోస్టాఫీసు యిచ్చారు. మొట్టమొదటి పోస్టుమాస్టరు నార్టన్.

బాలరాజ్యాన్ని పిల్లలే నిర్వహిస్తూండాలనీ, పిల్లలకి చిన్నప్పట్నుంచీ బాధ్యతలు తెలియడం మంచిదనీ ఫ్లానగన్ అనుకునేవాడు. ఆ ప్రకారం మొదటి ప్రయత్నం 1926 లో చేశాడు. ఒక మేయరునీ, కొందరు కమీషనరులనీ పిల్లలు తమ నుంచి ఎన్నుకొని, వారి పాలనకి లోబడి వుండటం. అక్షరాలా పట్నంలో ఎలా జరుగుతుందో అలా. ఎన్నికల విషయంలో పిల్లలు హడావుడి చూపారుగాని, ఆపైన అనుకున్నట్టు పనులు జరిగేవి కాదు.

1934 డిసెంబరులో పోస్టాఫీసు వచ్చాక, పిల్లల స్వయం ప్రభుత్వం విషయమై మరొకసారి ప్రయత్నం చేశాడు ఫ్లానగన్. బాలరాజ్యానికి ఒక మేయరూ, కొందరు కమీషనరులూ ఉండాలి; వారిని పిల్లలనుంచే ఎన్నుకోవడం. ఎన్నికల సమయంలో బాలరాజ్యంలో రెండు పార్టీలు ఏర్పడ్డాయి. బాలరాజ్యం పార్టీ ఒకటి, మననగర్ పార్టీ ఒకటి. ఇద్దరూ ఓట్ల కోసం ప్రచారం ప్రారంభించారు. ఒక అభ్యర్థి తను నెలకి రెండుసార్లు పిల్లలని పట్నం తీసుకువెళ్ళే ఏర్పాటు చేస్తానంటే, మరొక అభ్యర్థి వారానికి రెండు సినీమాలు బాలరాజ్యం

థియేటర్‌కి తెప్పించేటట్లు చేస్తాననేవాడు. ఎన్నికల సమయం లోని వాగ్దానాలు ఈ మాదిరిగా ఉండేవి.

పట్టణ నిబంధనలను అతిక్రమించిన పిల్లలని మేయరు కమీషనరుల సలహా తీసుకుని శిక్షించేవాడు. ఏవో పెద్దపెద్ద నేరాలయితే తప్ప పోలీస్ స్టేషన్ దాకా వెళ్ళేవే కాదు — పిల్లలే తమలో తాము చూసుకునేవారు.

చాలా కఠిన శిక్ష అంటూ కూడా ఒకటి వుండేది వారికి. దానిని సినిమాశిక్ష అనేవారు. నేరస్థుణ్ణి బాలరాజ్యం థియేటర్‌లో చూపే సినిమాకి తీసుకువెళ్ళి, వెనకగా తిరిగి నుంచోబెడతారు. అతను తల తెరవైపుకి తిప్పకుండా యిద్దరు బాలపోలీసులు కాపలాగా నుంచుంటారు. తోటిపిల్లలందరూ సినిమా చూసి ఆనందిస్తూ వుండగా, తను వారి మధ్యనే వెనకవైపుగా తిరిగి నుంచోవడం కంటె శిక్ష ఏముంటుంది?

బాలరాజ్యానికి పదిహేనుగురు కమీషనర్లూ, నలుగురు పెద్దలుగా ఉంటారు. ఈ నలుగురు పెద్దలనుంచీ మేయరుని ఎన్నుకోవాలి. ఆ [illegible] పదవుల కాలపరిమితి ఆరేసి నెలలు. తన పేరు చదవడం రాయడం వచ్చిన ప్రతి బాలునికీ వోటింగ్ హక్కు ఉంటుంది.

ప్రతి కమీషనరూ బాలరాజ్యంలోని ఒక్కొక్క విభాగానికి బాధ్యుడు. మొదట మేయరు, మేయరు తర్వాత పెద్దలు, పెద్దల తర్వాత కమీషనర్లూ, కమీషనర్లకి లోబడి పిల్లలుగా ఉంటూండేవారు. కమీషనరులూ, యితర

బాలురూ ఒక చోట నివసిస్తూన్నప్పటికీ, వారంటే పిల్లలకి గౌరవ ప్రపత్తులు వుండేవి.

పిల్లల కోర్టులో మేయరు అధ్యక్షుడుగా ఉండేవాడు. కమీషనరులు అవసరమైన సలహాలు యిస్తూండేవారు. దోషిగా నిర్ణయింపబడ్డ కుర్రవానికి బాలరాజ్య సూత్రాల ననుసరించి శిక్ష విధించేవారు. వంటపని, తోటపని, గిన్నెలు కడగడం, యిళ్ళు వూడవడం—యిలాటి యిష్టం కాని పనులు కుర్రవానిచేత ప్రతిరోజూ ఒక గంటో, రెండుగంటలో చొప్పున పది పదిహేను రోజులపాటు చేయించడమే శిక్ష. అంత కంటె ఏం కావాలి పిల్లవాని మనస్తత్వం మార్చేందుకు?

## 26

పిల్లల ఆటలవిషయంలో ఫాదర్ ఫ్లానగన్ అశ్రద్ధ చేసే వాడు కాదు. మనసునీ, దేహాన్నీ, హృదయాన్నీ శాంతపరచే గుణం ఉంటుంది ఆటలలో. ఆటలంటే ఫాదర్ కి చిన్నప్పట్నుంచీ సరదా. 1943 దాకా ఆయన హాండ్ బాల్ ఆడుతూనే వుండేవాడు.

"ఎక్కువ స్కోర్ వచ్చిన జట్టుని కాదు మనం మెచ్చుకోవలసినది. మోసం గీసం లేకుండా బాగా ఆడిన జట్టుని మనం మెచ్చుకోవాలి," అంటూండేవాడు ఫాదర్ ఫ్లానగన్.

అలా అనేవాడేగాని బాలరాజ్యం జట్టు యితరులతో ఆడి వోడిపోతే అతను భరించలేక పోయేవాడు. ఫుట్ బాల్ కీ, బేస్ బాల్ కీ బాలరాజ్యం మొదటినుంచీ ప్రసిద్ధి. బాస్కెట్

బాల్ కోర్టులు ఆరవైజను వున్నాయి, టెన్నిస్ కోర్టులూ, ఈతాలాట చెరువులూ మొదలైనవి చెప్పనే అక్కర్లేదు.

1935–1947 ల మధ్య బాలరాజ్యం ఫుట్ బాల్ జట్టు 84 పోటీలలో విజయం సాధించింది; ఇరవై పోటీలలో ఓడిపోయింది; ఎనిమిది సమానం అయాయి. మిగతా ఆటలలో కూడా బాలరాజ్యం విద్యార్థులు చాలా సమర్థులు. బాలరాజ్యం "అల్లరిమూక" అల్లరిమూక కాదనీ, సుశిక్షితులైన ఆటగాళ్ళనీ యితర బృందాలు తెలుసుకున్నాయి. ఒకసారి బాలరాజ్యం ఆటగాళ్ళు ఫుట్ బాల్ ఆడుతున్నప్పుడు లక్షమంది ప్రేక్షకులు వచ్చి చూశారు.

ప్రేమ అనే దివ్యౌషధంతో అన్ని వ్యాధులూ కుదురుతాయని ఫాదర్ ఫ్లానగన్ కి తెలుసు. ఆటలుకూడా పిల్లలకి ఔషధం లాంటివి. కాస్త ఓపిక చూపెడితే, అవి పనిచేసినట్టు మరేవీ పనిచెయ్యవు.

## 27

పెరల్ హార్బర్ సంగతి తెలియగానే బాలరాజ్యంలోని పిల్లలు సైన్యంలో చేరేందుకు ఆత్రపడ్డారు. పెద్ద పిల్లలు వెంటనే చేరారు; మిగతా పిల్లలు సైనిక శిక్షణ పొందుతున్నారు.

యుద్ధభూమికి వెళ్ళిన బాలరాజ్యం పిల్లలగురించి వార్తలు రావటం మొదలెట్టాయి. కొందరు తప్పిపోయారు; కొందరు క్షతగాత్రులయారు; కొందరు మృత్యువాత పడ్డారు.

జిమ్మీ 1935 లో బాలరాజ్యానికి వచ్చిచేరాడు. అతనితో తన యిద్దరి సోదరులూ కూడా చేరారు. జిమ్మీకి తల్లిదండ్రులు లేరు. 1943 లో అతను ఫాదర్ ఫ్లానగన్ కి యిలా రాశాడు: "చాలా రోజులయింది మీకు ఉత్తరం రాసి...ఈమధ్య క్షణం తీరిక ఉండటం లేదు...ప్రస్తుతం నేను ఇటలీలో వుంటున్నాను శత్రు స్థావరాలకి దగ్గిరగా...ఈ మధ్య నాకో గాయం తగిలింది. చిన్నగాయమే అనుకోండి. పర్పుల్ హార్ట్ మెడల్ బహూకరించారు నాకు...వీలుచూసుకు ఆ మెడల్ మీకు పంపుతాను. నేను అమెరికా వచ్చాక నాకు యిద్దరు గాని...నేను జీప్‌లో ఉండగా శత్రువిమానం వేసిన బాంబు వల్ల ఈ గాయం తగిలింది..."

నాలుగు రోజుల అనంతరం జిమ్మీ మరణించాడు.

* * *

బాలరాజ్యానికి చెందినవారు వెయ్యిమందికి పైగా రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొన్నారు. వారి సాహస కార్యాలు వింటున్నప్పుడు ఫ్లానగన్ నేత్రాలు అశ్రుపూరితములయేవి. నౌకాశాఖలో, విమానశాఖలో, ఆర్మీలో ఫ్లానగన్ పిల్లలు ప్రశంసాపాత్రంగా పనిచేశారు.

కుటుంబాలు చితికిపోతున్నాయి; విలువలు మారిపోతున్నాయి; జీవన విధానం వక్రగతి ననుసరిస్తోంది; వీటన్నిటికీ పర్యవసానం పిల్లల బాధలు ఎక్కువకావడం. తండ్రి యుద్ధభూమిలోనూ, తల్లి దేశసేవ నిమిత్తం ఆస్పత్రిలోనూ—యింట్లో కుర్రవాణ్ణి చూసే దిక్కు వుండేది కాదు. దేశభక్తి

గొప్పదే కాని. ఎవరి పిల్లలని వారు చూసుకోవడంకూడా
నూ నెయ్యవలసినంత గొప్పదికాదు.

"నా" అనే వాళ్ళు లేని ఈ మాదిరి పిల్లలు బాల
రాజ్యానికొచ్చి నిలబడుతూండేవారు. కొడుకు యుద్ధ
భూమిలో వుండగా కోడలు మరొకతనితో లేచిపోయిందనీ,
మర్రివాళ్ళని పోషించగలిగేపాటి డబ్బు తనదగ్గిర లేదనీ ఒక
ముసలావిడ తన మనుమల్ని బాలరాజ్యానికి పంపింది. వారు
ముగ్గురు. యుద్ధభూమినుంచి తిరిగి వచ్చిన తండ్రి పిల్లలని తన
దగ్గిర వుంచుకుంటానన్నాడు. ఆ పిల్లలతండ్రి మరొకామెని
పెండ్లి చేసుకొని, ఒక తోటకొని అందులో వుంటున్నాడు.
పెద్దపిల్లలిద్దరూ బాలరాజ్యం వొదిలి రావడానికి అంగీకరించలేదు.
మూడోవాడు మాత్రం తండ్రి వెంట వెళ్లాడు. చిట్టితమ్ముడూ
అన్నయ్యలిద్దరూ ఉత్తరాలు రాసుకుంటూండే వారు. కొత్త
అమ్మ చాల మంచిదనీ, తనని ఎంతో ప్రేమతో చూస్తోందనీ
రాసేవాడు చిట్టితమ్ముడు.

ఒక రోజున ఫ్లానగన్ అన్నాడు పెద్ద పిల్లలిద్దరి
తోటీ "మీ నాన్నా, మీ కొత్త అమ్మా, మీ చిట్టి
తమ్ముడూ మీ కోసం వలవరిస్తున్నారు. ప్రేమించే మనుషులు
గల బాలురు అదృష్టవంతులు. మీరు అక్కడ సుఖపడ
తారు."

పెద్దపిల్లలిద్దరూకూడా తండ్రివద్దకు వెళ్ళారు. కొన్ని
చిక్కులు మధ్యలో వచ్చినప్పటికీ కుటుంబమంతా ఒక
టయింది

ఈ మాదిరి ఆనందం నూటికీ కోటికీ కలుగుతుంది. లక్షలాది బాలురు దిక్కూ మొక్కూ లేక ఏడుస్తున్నారు. యుద్ధపీడిత దేశాలలో చెప్పనే అక్కర్లేదు. ఫాదర్ ఫ్లానగన్ దృష్టి ఆ దేశాలలోని పిల్లలమీదికి పోయింది.

## 28

ఐర్లండులో పుట్టి అమెరికాలో స్థిరనివాసం ఏర్పరుచుకున్న ఈ కాథలిక్ మతగురువు దూరప్రాచ్యానికి ప్రయాణం కట్టాడు. ప్రాచ్యఖండపు పిల్లల అవస్థ చెప్పతరం కాదు. జనరల్ మెకార్థర్ సయితం ఫ్లానగన్ సహాయం కోరాడు.

ఫాదర్ ఫ్లానగన్ తనవెంట బైరన్ రీడ్‌ని తీసుకు వెళ్ళాడు. హొనొలులు, తర్వాత గామ్ వెళ్ళాడు. గామ్‌లో బాలరాజ్యం పాతవిద్యార్థులు పదిహేనుగురు కనిపించారు ఫ్లానగన్‌కి. గవర్నర్ భవంతిలో ఫాదరీ గౌరవార్థం విందు ఏర్పాటు చేశారు.

వెనక బాలరాజ్యంలో పెడ్రో అను మెక్సికన్ కుర్రవాడొకడు వుండేవాడు. వినయ విధేయతలుగల కుర్రవాడు; కష్టపడి చదివేవాడు. అన్నీ బాగానే వుండేవిగాని అతనికొక చెడుగుణం ఉండేది. సిగరెట్లు కాల్చడం. తను కాల్చనని ఎన్నిసార్లో వాగ్దానాలు చేసేవాడు. కాని మళ్ళీ కాల్చేవాడు. ఎన్నివిధాలైన శిక్షలు విధించినప్పటికీ ఆ అలవాటునుంచి తప్పించుకోలేకపోయేవాడు. "నాలుగో ఏటనుంచి నాకు ఈ అలవాటు వుంది; ఇప్పుడు పదేళ్ళు వచ్చాయా, యింక ఎలా మానగలను?" అని మొహంమీద అడిగేవాడు. ఫ్లానగన్‌కి

పెడ్రో వ్యవహారం ఒకసమస్య అయిపోయింది. ఆ కుర్రవాని గురించి ఆలోచిస్తూ అనేక రాత్రులు నిద్రకు దూరమయ్యాడు ఫ్లానగన్. పెడ్రోకి సిగరెట్టు వీకె దొరక్కుండా చెయ్యడం ఎలా? రకరకాల విజిటర్లు వస్తారు. కాల్చి పారేసిన ముక్కలు గిరవాటు వేస్తారు. అవి కావలసినన్ని పోగుచేసు కునేవాడు పెడ్రో. బాలరాజ్యంలో అగ్గిపుల్ల కనిపించ రాదని ఉత్తరువు జారీచేశాడు ఫ్లానగన్ ఒకరోజున. అయి నప్పటికి పెడ్రో సిగరెట్లు కాల్చగలిగాడు. "ఎలా వెలిగిం చాన్?" అని అడిగితే చెప్పలేదు. రెండురోజుల తర్వాత ఫాదరీకి తెలిసింది. పూజామందిరంలోని దీపంతో సిగరెట్టు ముట్టిస్తున్నాడని. ఇంతలో పెడ్రో మేనత్త ఒకామెవచ్చి, కుర్రవాణ్ణి బాలరాజ్యంనుంచి తీసుకు వెళ్ళిపోయింది. ఇదిఎన్నేళ్ళ క్రితమో జరిగిన సంగతి.

విందుకి అందరూ కూచున్నాక వచ్చాడు ఆ పెడ్రో. నావికుని దుస్తులలో ఉన్నాడు. ఫాదర్ ఫ్లానగన్ తన పాత విద్యార్థిని గుర్తించి, "పెడ్రో, యిదిగో ఒక సిగరెట్ తీసుకో," అని యిచ్చాడు సిగరెట్టుపెట్టె.

"క్షమించండి, ఫాదర్. బాలరాజ్యం వదిలిననాటినుంచీ యింతవరకూ నేను సిగరెట్టు ముట్టలేదు."

* * *

మరలామొదుగా టోకియో వెళ్లాడు ఫ్లానగన్. జనరల్ మెకార్థర్ ఎంతో ఆదరంతో ఆహ్వానించాడు. జపాన్ పిల్లల విషయమై ఒక రిపోర్టు తయారుచేసి యివ్వమన్నాడు.

జపాన్‌లోనూ, కొరియాలోనూ పరిస్థితులు తను అనుకున్న దానికంటె మరీ అధ్వాన్నంగా ఉన్నాయి. కుటుంబ వ్యవస్థని ఆధారంగా చేసుకొని సామాజిక జీవితం గడుపుకునే జపాన్‌కి పిల్లల సమస్యలంటూ వుండేవి కాదు వెనక. ఈ యుద్ధంతో అంతా చిందర వందర అయిపోయింది. లక్షలాది పిల్లలు దిక్కూ మొక్కూ లేకుండా పడివున్నారు. అనుభవ జ్ఞానం లేనివారు అనాధాశ్రమాలు నడుపుతున్నారు. కొన్ని చోట్ల ఈ పిల్లలచేత కూలిపనులు—రోజుకి ఎనిమిదిగంటల చొప్పున వారానికి ఆరురోజులు—చేయిస్తున్నారు. ఆ పిల్లలు చేసిన వస్తువులు లాభాలకి అమ్ముకుని, యజమానులు నాలుగు రాళ్ళు సంపాదించుకుంటున్నారు. పిల్లలకి విద్య నేర్పడంగానీ, ఆటలాడుకునేందుకు అవకాశం యివ్వడంగానీ, నైతిక బోధన గానీ ఏమీ ఉండేది కాదు. అనాధశరణాలయాలు యించుమించు జైళ్ళ మాదిరిగా ఉండేవి.

అయిదుగురు కుర్రవాళ్ళని కోర్టుకి ఒక్కడు చొప్పున అయిదు కొట్లలో బాధించడం చూసి, వారు చేసిన నేరమేమిటి? అని అడిగాడు ఫాదర్ ఫ్లానగన్ పక్కనే వున్న జపాన్ ఆఫీసరుని.

"వాళ్ళు కొత్త పిల్లలు. అలా కొన్నాళ్ళు కొట్లో వుంచితేగాని వాళ్ళు మనం చెప్పినమాట వినరు."

"తక్షణం వారిని విడుదల చెయ్యండి," అని అరిచాడు ఫ్లానగన్.

వారిని విడుదల చేసినతర్వాతగాని తను చెప్పదలుచుకున్న ఉపన్యాసం చెప్పలేదు. తమని అర్థం చేసుకునే మనిషి వచ్చినందుకు పిల్లలందరూ ఆరోజున ఎంతో సంతోషించారు.

ఫాదర్ ఫ్లానగన్ పర్యటనవల్ల అనేక శరణాలయాలు బాగుపడ్డాయి. ఫ్లానగన్ సూచించిన సంస్కరణలు అమలు జరిగేట్టు చూశారు జపానులోని అమెరికన్ ఉద్యోగులు. కొరియాలో మొగపిల్లలనీ, ఆడపిల్లలనీ ఒకే గృహంలో వుంచడం చూసి ఫాదరీ ఆగ్రహపడ్డాడు. తక్షణం ఆడపిల్లలని మరొకచోటుకి తీసుకు వెళ్ళమన్నాడు.

ఎక్కడికివెళ్తే అక్కడ ఫాదర్ ఫ్లానగన్‌కి అఖండ స్వాగతం యిచ్చారు. లక్షలాది పిల్లలు అతని దర్శనం కోసం కాచుకుని వుండేవారు.

జపానులోని బాల విద్యాకేంద్రాలకి, అనాధ శిశు శరణాలయాలకి ఫాదర్ ఫ్లానగన్ ఎన్నో సలహాలు యిచ్చాడు. జనరల్ మెకార్థర్ అంటాడు: "ఫాదర్, మాకు వేలమంది మనుషులే తెలుసు. మీరు లక్షలాది ప్రజల హృదయాలని చూడగలిగారు. సమస్త వివరాలతో రిపోర్టు తయారుచేసి యివ్వండి."

ఒమహాకి తిరిగివచ్చాక, అంకెలతో, వివరాలతో జపాను, కొరియా దేశాలలోని బాలబాలికల సంస్థల గురించి చక్కటి రిపోర్టు రాశాడు. మతసంబంధమైన నైతిక విద్యాబోధనసర్వత్రా అవసరమన్నాడు. ఆ రిపోర్టును ప్రాచ్యఖండపు బాలుర కోసం తయారైన స్వాతంత్ర్య పత్రం అనవచ్చు.

షాంగ్ హైలో అప్పటికప్పుడే బాలరాజ్యం వంటిది ఒకటి స్థాపించారు.

## 29

శిథిలావస్థలో వున్న బెర్లిన్ నగరంలో గుండెపోటు వల్ల మరణించాడు ఫాదర్ ఫ్లానగన్.

1948 శీతాకాలంలో ప్రభుత్వాదేశంమీద జర్మనీలోనూ, ఆస్ట్రియాలోనూ వున్న బాలుర స్థితుగతులు పరిశీలించేందుకు ఫాదర్ ఫ్లానగన్ వెళ్ళవలసివచ్చింది. అలసిపోయిన తనకి ఈ అరవై రెండోఏట యింతటి కార్యభారం ఎందుకనుకున్నాడు. తనకి వెళ్ళాలని లేదనికూడా స్నేహితులతో మాటవరసకి అన్నాడు. కాని, యిది పిల్లలకి సంబంధించిన విషయం. అందులో ఓడిపోయిన శత్రువుల పిల్లలకి సంబంధించిన విషయం. అంచేత తప్పకుండా వెళ్ళాలి.

బాలరాజ్యంలోని పై తరగతి విద్యార్థులు తను తిరిగి వచ్చేటప్పటికి వుండరుగనక వారి దగ్గిర సెలవు తీసుకోవాలనుకున్నాడు ఫ్లానగన్. నలభై ఏడుగురు పై తరగతి విద్యార్థులూ ప్రార్థనా మందిరరంలో సమావేశమయారు. క్రీస్తు మతబోధనలు పిల్లలకి వివరించి చెప్పాడు ఫ్లానగన్. "అందరూ ఉత్తమ పౌరులుగాతయారై భగవత్సేవ, దేశసేవ చేయాలి" అన్నాడు ఫ్లానగన్ తనవిద్యార్థులని ఉద్దేశిస్తూ. బాలరాజ్యం యావత్తూ ఫ్లానగన్‌కి వీడ్కోలు యిచ్చింది.

ఫ్లానగన్‌కి సాయంగా అతని వెంట నార్టన్ ఉన్నాడు. బాలరాజ్యంనుంచి బయలుదేరేటప్పటికి సూర్యాస్తమయింది.

వెనక్కి చూశాడొకసారి ఫ్లానగన్. ఒమహాలోని ఆ యిళ్ళూ, ఆ మేడలూ, ఆ గోపురాలూ, తను నిర్మించిన ఆ బాలరాజ్యమూ వింతకాంతులతో ప్రజ్వరిల్లాయి.

* * *

ఐర్లండులోని రాస్ కామన్ గ్రామంలో ప్రారంభమయిన జన్మ బెర్లిన్ పట్నంలో అంతం కావలసి వచ్చింది.

1948 మే 14 న ఫ్రాక్ ఫర్ట్ నుంచి ఉదయమే విమానంలో వచ్చాడు బెర్లిన్ కి. హాజరు కావలసిన సమావేశాలూ, సభలూ బోలెడన్ని వున్నాయి. జర్మన్ పిల్లలు చాలా దీనస్థితిలో ఉన్నారు. కూలిపోయిన యిళ్ళూ; ఆకలితో అలమటించిపోయే పిల్లలూ; పగలంతా పని. సాయంత్రమయింది. తను చూసిన శిథిలాలు మర్చిపోవడానికి పదే పదే ప్రయత్నిస్తూ భోజనాల బల్లదగ్గిర కూర్చున్నాడు. తను, నార్టన్, మరొక సైనికోద్యోగి ముగ్గురూ కలిసి భోజనం చేశారు. మర్నాటి కార్యక్రమం గురించి నార్టన్‌తో సంప్రదించాడు. జనరల్ క్లేని కలుసుకోవాలి. పోప్ చెప్పిన విషయ మొకటి వుంది. తరవాత జర్మనీలోని యువజన సమితుల గురించి కొన్ని విషయాలున్నాయి. "జర్మన్ పిల్లల గురించి జర్మనీ వారికి తెలిసినట్టుగా బయటివాళ్ళకి తెలియదు" అన్నాడు నార్టన్‌తో మాటల సందర్భంలో.

సుమారు తొమ్మిదిన్నరకి మంచంమీద పడుకున్నాడు. అర్ధరాత్రివేళ లేచి నార్టన్‌ని పిలుస్తూ అన్నాడు: "గుండెల్లో నొప్పిగా ఉంది. తక్షణం డాక్టరుని తీసుకు రావాలి."

డాక్టర్ వచ్చి ఫ్లానగన్‌కు గుండెపోటు వచ్చిందనీ, వెంటనే ఆస్పత్రికి తీసుకువెళ్ళడం మంచిదనీ అన్నాడు. అతను వచ్చినపని అయిపోయింది. భగవత్ప్రార్థన చేస్తూ కళ్ళు మూశాడు ఫాదర్ ఫ్లానగన్.

* * *

బాలరాజ్యం పిల్లలు రేడియో ద్వారా ఈ శోకవార్త విన్నారు. వినీవినగానే అందరూ ప్రార్థనా మందిరానికి వెళ్ళి ఫాదర్ ఫ్లానగన్ ఆత్మశాంతికై ప్రార్థనలు జరిపారు.

కొద్దిరోజులయాక విమానంలో వచ్చింది ఫాదర్ ఫ్లానగన్ మృతదేహం. దానిని శవ పేటికలో ఉంచి, బాలరాజ్యంలో భద్రపరిచారు.

ఆయన సమాధికి పాలరాతిమీద బంగారు అక్షరాలతో ఈ విధంగా వ్రాయబడిన పలక అతికించారు:

ఫాదర్ ఫ్లానగన్—బాలరాజ్య నిర్మాత.

దేవుణ్ణీ మానవుణ్ణీ ప్రేమించాడు.

జులై 13. 1886—మే 15. 1948.



ఫాదర్ ఫ్లానగన్

"దిక్కులేని ఈ పాలబుగ్గల పసికందులకు తిండి, బట్ట, తలదాచుకోడానికి చోటుకంటె కూడా వారు నోచుకోనివి కన్నతల్లిచూపే లాలన; తండ్రి అలవరచే వివేకం; సొంత కుటుంబంపట్ల కలిగే ప్రేమానురాగాలు. ఈ బాలలు కోల్పోయిన ఈ మహానష్టాన్ని మనం భర్తీచేస్తే తప్ప మన రిఫారం స్కూళ్ళవలన, అనాథబాల శరణాలయాల వలన ప్రయోజనమేదీ ఉండదు."

—ఫాదర్ ఫ్లానగన్.